# ఈనాడు ఆదివారం

10 సెప్టెంబరు 2017






# ట్విటర్
## ఇక్కడ మాటే మంత్రం!

# సినిమా పజిల్







## ఏ సినిమా?

త్రివిక్రమ్ దర్శకత్వంలో మూడు సినిమాల్లో నటించిన ఒకేఒక్క హీరోయిన్ సమంతా. ఆ మూడు సినిమాల్లో బాగా గుర్తుండిపోయే సన్నివేశాల తాలూకు వర్కింగ్ స్టిల్స్ ఇవి. వీటి ఆధారంగా ఆ సినిమాలేవో చెప్పగలరా?

## విరహ గీతం

అజరామరమైన ఈ విరహగీతాల్ని అందించిన సినిమా పేర్లేంటో తెలుసా?

1. చెలియా చెలియా చేజారి వెళ్లకే సఖియా సఖియా ఒంటరిని చేయకే...
2. గాలి వానలో వాన నీటిలో పడవ ప్రయాణం
3. అడిగా అడిగా ఎదలో లయనడిగా కదిలే క్షణమా చెలి ఏదని...
4. ప్రేమ లేదనీ ప్రేమించ రాదనీ సాక్ష్యమే నీవనీ...
5. నీ సుఖమే నే కోరుతున్నా నిను వీడి అందుకే వెళుతున్నా
6. చెలియ లేదు చెలిమి లేదు వెలుతురే లేదు

## ముచ్చటగా మూడు

ఈ ప్రశ్నలకు జవాబులు తెలుసా?

1. జల్సా, బాద్‌షా, శ్రీశ్రీ... ఈ మూడు సినిమాలకీ వాయిస్ ఓవర్ చెప్పిన సూపర్‌స్టార్ ఒక్కరే... ఎవరు?
2. కల్యాణ్‌రామ్, జూ.ఎన్టీఆర్, శ్రీకాంత్... ఈ ముగ్గురినీ హీరోలుగా పరిచయం చేసిన నిర్మాణ సంస్థ ఏది?
3. ఠాగూర్, షాక్, విక్రమార్కుడు... ఈ మూడు సినిమాల్లో చనిపోయే పాత్రలో కనిపించే హీరోయిన్.
4. సిద్ధార్థ్, తమన్, జెనీలియా... ఈ ముగ్గురూ తెలుగులో కనిపించిన తొలి సినిమా.
5. ఒక్కడు, ఆంజనేయులు, దేశముదురు... ఈ మూడు సినిమాల్లో హీరోల వృత్తి ఒక్కటే. ఏంటది?

## ఎన్టీఆర్ స్పెషల్

జూ.ఎన్టీఆర్‌కి సంబంధించిన ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పగలరేమో చూడండి.

1. ఎన్టీఆర్ తన అసలు పేరుతోనే నటించిన సినిమా?
2. తొలి భాగమంతా ఎన్టీఆర్ మూగవాడిగా కనిపించే చిత్రం?
3. ఎన్టీఆర్ త్రిపాత్రాభినయంలో కనిపించనున్న సినిమా పేరు?
4. లంచగొండి పోలీస్‌గా ఎన్టీఆర్ నటించిన సినిమా?
5. ఎన్టీఆర్ చనిపోయి మళ్లీ బతికే ఫ్యాంటసీ చిత్రం?

## పేరులో ఊరు

ఇక్కడున్న ఖాళీల్లో కొన్ని ఊళ్ల పేర్లు పెడితే సినిమా పేర్లు పూర్తయిపోతాయి. ప్రయత్నించండి.

1. సిద్ధూ ఫ్రమ్ - - - -
2. బుజ్జిగాడు మేడిన్ - - -
3. - - - టాకీస్
4. సీతాపతి చలో - - - -
5. - - - - బుల్లోడు
6. - - - - - - పోలీస్ స్టేషన్

## పేరు తెలుసా?







ఈ మూడు ఫొటోలూ పవన్ కల్యాణ్ నటించిన ఓ సినిమాకి సంబంధించినవి. వీటి ఆధారంగా అది ఏ సినిమానో చెప్పగలరా?

## గుర్తుపట్టారా?

ఈ ఫొటోలో- ఇప్పుడిప్పుడే హీరోగా ఎదిగే ప్రయత్నాలు చేస్తున్న కుర్రాడిని గుర్తుపట్టారా? అతడి కుటుంబంలో అందరూ హీరోలే.



## జోడీ

ఈ ఏకాక్షర సినిమా పేర్లనీ, వాటిలో నటించిన హీరోలనీ జతచేయండి.

| | | | |
|---|---|---|---|
| 1. | జై | ఎ. | విష్ణు |
| 2. | రా | బి. | నితిన్ |
| 3. | సై | సి. | ఉపేంద్ర |
| 4. | ఢీ | డి. | మనోజ్ |
| 5. | శ్రీ | ఇ. | నవదీప్ |

## బొమ్మల్లో సినిమా

ఇక్కడున్న బొమ్మల ఆధారంగా అవి సూచించే సినిమా పేర్లేవో చెప్పగలరా?

1. 2. 3. 4. 5.



(సమాధానాలు 29లో)

## అక్కడ బామ్మలే షెఫ్‌లు

ఇది విన్నారా..!

ఏదైనా వంటకాన్ని రుచి చూసి... 'అబ్బా! ఎంత బాగుందో, అచ్చం మా బామ్మచేతి వంటను గుర్తుకు తెచ్చింద'ని మెచ్చుకుంటే చాలు అంతకు మించిన ప్రశంస మరొకటి ఉండదు. అలవోకగా అద్భుత రుచులను తయారుచేసే బామ్మను మించిన షెఫ్ మరొకరు ఉండరంటే అతిశయోక్తి కాదు. పిల్లల నుంచి పెద్దల వరకూ బామ్మచేతివంట అంటే అంత మక్కువ మరి. బామ్మ చేతివంటకు రెస్టరెంట్ ఫ్లేవర్ జత యితే... వివిధ దేశాలకు చెందిన బామ్మలు వారి స్థానిక వంటకాలను ఒక దగ్గరే అందిస్తే... ఆ రుచిని ఎంత వర్ణించినా తక్కువే అవుతుంది. వినూత్నంగా ఉన్న ఈ ఆలోచననే ఆచరణలో పెట్టారు జోడీ స్కారవెల్లా.



న్యూయార్క్‌కి సమీపంలోని స్టాటెన్ ద్వీపంలో ఉన్న తన సొంత రెస్టరెంట్‌లో జపాన్, అర్జెంటీనా, వెనెజులా, ఇటలీ, గ్రీస్, ఫ్రాన్స్, సిరియా... ఇలా వివిధ దేశాలకు చెందిన ఓ ముప్ఫై మంది బామ్మలనే షెఫ్‌లుగా నియమించుకున్నాడు. జోడీ తొలుత ఇటాలియన్ బామ్మలతోనే ఈ రెస్టరెంట్‌ను ప్రారంభించాడు. దీనికి మంచి స్పందన రావడంతో వివిధ దేశాలకు చెందిన బామ్మలను ఇక్కడ షెఫ్‌లుగా చేర్చుకున్నాడు. దీంతో విదేశీయులు కూడా ఈ రెస్టరెంట్‌కు వచ్చి బామ్మచేతి వంటలను ఆస్వాదిస్తున్నారట. స్థానికులనూ ఎక్కువగా ఆకర్షించేందుకు ప్రతి షిఫ్ట్‌లో ఒక ఇటాలియన్ షెఫ్ కచ్చితంగా ఉండేలా జాగ్రత్తలు తీసుకుంటారట జోడీ.

# మీ మాట



ఈ సంచికపై మీ అభిప్రాయాలను sunday@eenadu.netకు మెయిల్ చేయవచ్చు.

### అద్భుతం

పైలట్ శిక్షణా, అంతరిక్ష పరిశోధనలూ, శస్త్ర చికిత్సల నిర్వహణలో ఆయా రంగాల నిపుణుల్ని సంసిద్ధం చేసేందుకు వాడే సిమ్యులేటర్ల గురించి ఇచ్చిన ముఖచిత్ర కథనం అద్భుతంగా ఉంది. మనుషుల ప్రాణాలతో ముడిపడి ఉన్న రంగాల్లో ఈ సిమ్యులేటర్ల వాడకం ద్వారా ప్రాణనష్టం లేకుండా నిపుణుల్ని తయారు చేయడం నిజంగా గొప్ప విషయం.

*- ఐ.సత్యనారాయణ శర్మ, ఖమ్మం*

### హత్తుకుంది

'పరుసవేది' కథ హృదయాన్ని హత్తుకుంది. గుండెల నిండా ప్రేమను పంచే రాణీలాంటి అమ్మాయిని పోగొట్టుకోవడం నిజంగానే రఫీ దురదృష్టం. అతను పోగొట్టుకున్నది రచయిత చెప్పినట్టు అమూల్యమైనదే.

*- ఆర్వీ రమణమూర్తి, పాత టెక్కలి*

### స్ఫూర్తిదాయకం

మనిషి ఎంత ధనం సంపాదించినా అతన్ని గొప్ప మనిషిగా నిలబెట్టేది మాత్రం దాన ధర్మాలే. ఆ పరంగా తను సంపాదించిన దాంట్లో కొంత మొత్తాన్ని గల్ఫ్ దేశాల్లో జైలు పాలైన విదేశీయుల కోసం ఖర్చు పెడుతున్న ప్రవాసభారతీయుడు ఒబెరాయ్ గొప్ప మనిషే కాదు, ఎందరికో స్ఫూర్తిప్రదాత కూడా.

*- కులకర్ణి బాబూరావు, జెక్లేరు, మహబూబ్‌నగర్ జిల్లా*

### బాగున్నాయి

సింగపూర్‌లోని చాంగీ ఎయిర్‌పోర్టు గురించి ఇచ్చిన కథనం, అందులోని ఫొటోలూ చాలా బాగున్నాయి. ఒక ఎయిర్‌పోర్టును ఇంత చక్కగా తీర్చి దిద్దడం నిజంగా అద్భుతమైన విషయం.

*- బి.ఎస్. స్వామి గౌడ్, హైదరాబాద్*

### ఆకట్టుకున్నాయి

రుచి అభిరుచిలో స్నాక్ ఐటెమ్స్ బాగున్నాయి. పిల్లలు ఇష్టపడే శాండ్‌విచ్‌ను రకరకాలుగా చేసిపెట్టే అవకాశాన్ని కల్పించిందీ పేజీ. బొమ్మల్లాంటి కేకులు ఆకట్టుకున్నాయి. 'చెమట చిందిద్దాం' అంటూ ఫిట్‌నెస్‌వేర్ ఫ్యాషన్ మీద ఇచ్చిన కథనం బాగుంది.

*- వి. ఆదిత్య వర్ధన్, ముల్లపాడు, ప్రకాశం జిల్లా*

*- కె. శ్రీకాంత్ (ఈమెయిల్)*

### రుచి చూడాలనిపించింది

రంగురంగుల టీల గురించి అందించిన కథనం కొత్త విషయాలను తెలియజేసింది. మాసిన్రం ప్రాంతంలో వర్షాకాలం సెలవులిస్తారన్న విషయం ఆశ్చర్యంగా అనిపించింది. సిమ్యులేటర్ల ద్వారా యుద్ధరంగంలో పోరాడే సైనికులకూ, పైలట్లకూ ప్రమాదాల బారిన పడకుండానే పనిని నేర్పించడం మంచి విషయం.

*- సాదియా, విజయవాడ*

*- వి. సురేష్ (ఈ మెయిల్)*

# లోపల...



**ట్విటర్... ఇక్కడ మాటే మంత్రం!**



ఈరోజుల్లో సామాజిక మాధ్యమాలు ఉపయోగించుకోగలిగినవాళ్లకు ఉపయోగించుకున్నంత... అన్నట్లుగా మారాయి. ప్రత్యేకించి ట్విటర్ ఎన్నో పనులకు వారధి అవుతోంది. విదేశీ వ్యవహారాల శాఖ, రైల్వే శాఖల ట్విటర్ ఖాతాలు వినియోగదారులకు ఆప్తమిత్రుల్లా మారాయి. తనని ఉద్దేశించి చేసిన ట్వీట్లకు హుందాగా సమాధానమిస్తూ ప్రధాని మోదీ సైతం నెటిజన్ల మనసు దోచుకుంటున్నారు. **7**



### మంచిమాట

శిక్ష వల్ల తప్పు ఒప్పు కాదు, కానీ మరెన్నో తప్పులు జరగకుండా అది సహాయపడగలదు.

# చురుక్కు చమక్కు


బ్లూవేల్ ఛాలెంజ్
శ్రీధర్


ఆదాయం పన్నుశాఖ
ర్యాలీ
ర్యాలీ సక్సెస్!
ర్యాలీ సక్సెస్!
లాలూ
ర్యాలీ లెక్కలు చూపండి! - ఐటీ


డీఎంకే
దినకరన్
బీజేపీ
కమల్
రజిని
తమిళనాడు



**వాయునందనుడూ, వజ్రబల సమన్వితుడూ, అంజనీ పుత్రుడూ అయిన ఆంజనేయుడిని అర్చిస్తే చాలు ముక్కోటి దేవతలనూ పూజించిన ఫలితం దక్కుతుందట. అంతటి మహిమాన్వితుడైన హనుమ తెల్ల మద్ది వృక్షపు తొర్రలో వెలిసిన చోటు మద్ది ఆంజనేయస్వామి దేవాలయం. మద్దిచెట్టే గర్భాలయానికి గోపురంగా ఉండటం ఈ ఆలయ ప్రత్యేకత.**

# మహిమాన్వితం... మద్ది క్షేత్రం..!





హనుమంతుడికి రాముడంటే ఎంతి ష్టమో తనను శరణువేడిన భక్తులన్నా అంతే ప్రీతి. తలచినంతనే తన భక్తులను కష్టాల నుంచి గట్టెక్కిస్తాడు. అంతేకాదు, ఆయన్ను నమ్మిన వారికి మనోబలాన్నీ, బుద్ధి కుశలతనూ, మంచి వాక్కునూ అనుగ్రహిస్తాడు. వాయునందనుడిని భక్తితో కొలవాలే కానీ అసురుడినైనా అక్కున చేర్చుకుంటాడు. దీనికి నిదర్శనమే పశ్చిమగోదావరి జిల్లా జంగారెడ్డి గూడెం సమీపంలోని గురవాయిగూడెంలో ఉన్న మద్ది ఆంజనేయ స్వామి క్షేత్రం. ఓ అసుర భక్తుడి కోరికను మన్నించిన స్వామి అక్కడే ఓ చెట్టు తొర్రలో స్వయంభూగా వెలిశాడు.

## స్థల పురాణం..

సీతాన్వేషణలో భాగంగా లంకకు చేరుకున్న హనుమ పరాక్రమాన్నీ, బుద్ధి బలాన్నీ ప్రత్యక్షంగా చూసిన రావణుడి సైన్యంలోని మధ్యుడు అనే అసురుడు స్వామికి భక్తుడయ్యాడు. నిత్యం అంజనీసుతుడినే ఆరాధిస్తూ జీవనం సాగించేవాడు. శత్రు పక్షంలో ఉన్నందువల్ల స్వామిని నేరుగా దర్శించే భాగ్యం అతడికి లేకపోయింది. వచ్చే జన్మలోనైనా ఆయన సాక్షాత్కారం పొందాలన్న ఉద్దేశంతో హనుమ సేనకు ఎదురెళ్లి మధ్యుడు వీరమరణం పొందాడని పురాణాలు పేర్కొంటున్నాయి. ఆ అంశతోనే కలియుగంలో మధ్యుడు జన్మించాడనీ అతడిని అనుగ్రహించేందుకే మద్ది వృక్షంలో ఆంజనేయ స్వామి అవతరించాడని ప్రతీతి. ఓ భక్తురాలి స్వప్నంలో సాక్షాత్కారమైన ఆంజనేయుడు మద్దిచెట్టు తొర్రలో ఉన్న తనకు ఆలయాన్ని నిర్మించాలని ఆదేశించాడట. దీంతో చెట్టు దగ్గరకి వెళ్లి చూడగా అక్కడ ఆంజనేయ స్వామి రాతి విగ్రహం కనిపించిందట. అలా క్రీ.శ.1166వ సంవత్సరంలో ఆ ఊరివారికి స్వామి మొదటి దర్శనం లభించిందని పూర్వీకులు చెబుతున్నారు. తొలుత చెట్టు చుట్టూ గర్భాలయాన్ని మాత్రమే కట్టారు. తర్వాత 1978వ సంవత్సరంలో పూర్తిస్థాయి ఆలయాన్ని నిర్మించారు. అయితే మధ్యుడే మద్ది చెట్టుగా వెలిశాడన్న నమ్మకంతో ఆ చెట్టునే గర్భాలయ గోపురంగా ఉంచేశారు.

## ప్రదక్షిణ మొక్కులు..

తీరని కోర్కెలు ఉన్నవారూ పలు సమస్యలతో సతమతమవుతున్నవారూ ఈ ఆలయంలో ప్రదక్షిణలు చేస్తే ఫలితం ఉంటుందని భక్తుల విశ్వాసం. ఆలయ ప్రధాన మండపం చుట్టూ తొలుత 21 ప్రదక్షిణలు చేసి తమ మనసులోని కోర్కెలు తీరాలని మొక్కుకుంటారు. అవి నెరవేరిన తర్వాత మళ్లీ 108 ప్రదక్షిణలు చేసి స్వామికి మొక్కు చెల్లించుకుంటారు. దీనితోపాటు శని దోషాలూ, రాహు కేతు దోషాలూ, నవగ్రహ దోషాలూ ఉన్నవారు స్వామిని దర్శించుకుంటే అవి తొలగిపోతాయని భక్తుల నమ్మకం.

వైష్ణవ సంప్రదాయంలో మద్ది ఆంజనేయ స్వామికి నిత్యపూజలూ, అభిషేకాలను వైభవంగా నిర్వహిస్తారు. ప్రతి శనివారం స్వామివారి మూలవిరాట్‌కు పంచామృత అభిషేకం శాస్త్రోక్తంగా జరుపుతారు. ప్రతి నెలా స్వామి జన్మ నక్షత్రమైన పూర్వాభాద్ర నక్షత్రంలో సువర్చలా సమేత ఆంజనేయ స్వామి కల్యాణం వైభవంగా నిర్వహిస్తారు. ప్రతి మంగళవారం స్వామివారిని దర్శించుకోవడానికి దేశం నలుమూలల నుంచి లక్షలాది మంది భక్తులు వస్తుంటారు. దూరాభారాల నుంచి వచ్చే భక్తుల కోసం విశాలమైన మండపం, అతిథి గృహాలు అందుబాటులో ఉన్నాయి. ఈ క్షేత్రంలో నిత్యాన్నదానం జరుగుతుంది.

## వేడుకలు, ఉత్సవాలు...

మద్ది క్షేత్రంలో హనుమజ్జయంతి వేడుకలను అయిదు రోజులపాటు నిర్వహిస్తారు. ఆది, సోమవారాల్లో భక్తులతో సామూహిక హనుమద్ కళ్యాణాలూ, లక్ష్మీ కుంకుమార్చనలూ జరుపుతారు. కార్తిక మాసం నెల రోజులూ ఈ క్షేత్రం పండగ వాతావరణాన్ని సంతరించుకుంటుంది. ఈ నెలలో వచ్చే మంగళవారాల్లో స్వామికి లక్ష తమలపాకులతో ఆకు పూజ నిర్వహిస్తారు. ఆలయ ప్రాంగణంలోనే వేంకటేశ్వరస్వామి కూడా కొలువై ఉన్నాడు. ఆంజనేయుడిని పూజించిన భక్తులు శ్రీనివాసుడినీ దర్శించి సంపూర్ణ క్షేత్ర దర్శన ఫలాన్ని పొందుతారు.

ఈ క్షేత్రానికి సమీపంలోనే ఎర్రకాలువ జలాశయం ఉంది. ఇందులోని బోటు షికారు పర్యటకులకు ప్రత్యేక ఆకర్షణ. మద్ది క్షేత్రానికి 4 కి.మీ. దూరంలో జంగారెడ్డిగూడెం పట్టణాన్ని ఆనుకుని గోకుల తిరుమల పారిజాతగిరి క్షేత్రం ఉంది. పారిజాతగిరిపై శ్రీదేవి, భూదేవి సమేతంగా కొలువుదీరిన వేంకటేశ్వరస్వామి భక్తులకు దర్శనమిస్తాడు. ఇక్కడి స్వామివారిని దర్శిస్తే సాక్షాత్తు తిరుమల వేంకన్నను దర్శించిన అనుభూతి కలుగుతుందని భక్తుల విశ్వాసం.

## ఎలా వెళ్లాలంటే...

ఏలూరు నుంచి 50 కిలోమీటర్లూ, రాజమండ్రి నుంచి 70 కిలోమీటర్ల దూరంలో ఉన్న మద్ది క్షేత్రాన్ని చేరుకోవడానికి బస్సు సౌకర్యం ఉంది. పశ్చిమగోదావరి జిల్లా కేంద్రం నుంచి ప్రతి గంటకూ బస్సు ఉంటుంది.

– **కొండవీటి అనిల్‌కుమార్**, ఈనాడు, తాడేపల్లిగూడెం

– **కార్తీక్**, న్యూస్‌టుడే, లింగపాలెం

పరిశోధన

# దోస... తింటే మిస మిస..!



కూరగా వండుకునే దోసకాయతో పోలిస్తే కీరా దోసలోనే ఎక్కువ పోషకాలు ఉన్నాయని అనుకుంటారు. కానీ పసుపు రంగులో ఉండే దోసకాయలోనూ విటమిన్-కె, ఎ, బి, సి-విటమిన్లు పుష్కలంగా లభ్యమవుతాయి.

★ ముఖ్యంగా వీటిల్లోని విటమిన్-కె ఎముకల ఆరోగ్యానికి ఎంతో దోహదపడుతుంది. మెదడు నరాలు దెబ్బతినకుండానూ, ఆల్జీమర్స్ వ్యాధి నివారణకూ తోడ్పడుతుంది.

★ మెగ్నీషియం, పొటాషియం, సోడియం, సిలికాన్, సల్ఫర్... వంటి ఖనిజాలతోబాటు ఇతరత్రా యాంటీ ఆక్సిడెంట్లు దోసలో అధిక మోతాదులోనే దొరుకుతాయి. అందుకే హై బీపీతో బాధపడేవాళ్లకి దోస మంచి మందులా పనిచేస్తుంది. ఇందులోని క్షారగుణం అల్సర్లతో బాధపడేవాళ్లకి ఎంతో మేలు చేస్తుంది.

★ దోసకాయలో ఉండేది 96 శాతం నీరే అయినప్పటికీ ఆ నీరు, శరీర ఉష్ణోగ్రతను నియంత్రించేందుకూ, శరీరంలోని విష పదార్థాలను తొలగించేందుకూ దోహదపడుతుంది. చర్మసౌందర్యాన్నీ పెంచుతుంది.

★ ముఖ్యంగా దోస మధుమేహులకి ఎంతో మేలు. ఎందుకంటే ఇందులోని పోషకాలు ఇన్సులిన్ స్రావాన్ని ప్రేరేపిస్తాయి. కణాల పెరుగుదలకీ తోడ్పడతాయి. ఊబకాయంతో బాధపడేవాళ్లకి దోస మంచి ఆహారం. ఇంకా ఇందులోని సిలికాన్, సల్ఫర్లు శిరోజాల పెరుగుదలకీ సాయపడతాయి. అందుకే దోసకాయను భోజనంలో భాగం చేసుకోవడం మరువకండి..!

## పనిచేస్తూనే వ్యాయామం!

కూర్చోవడం వల్ల వచ్చే అనారోగ్య సమస్యల గురించి తెలియంది కాదు. అందుకే ఇటీవల కూర్చునీ నిలబడీ చేయగలిగే డెస్కులతో ఆఫీసుల్ని రూపొందిస్తున్నారు. అందులో బాగంగా వచ్చిన మరో కొత్త ఆలోచనే డెస్క్‌సైజ్ ప్రొ. మల్టీటాస్కింగ్‌ను ఇష్టపడే యువతను దృష్టిలో పెట్టుకుని తయారుచేసిన ఈ డెస్క్-సైకిల్‌మీద ల్యాప్‌ట్యాప్‌తో పనిచేసుకుంటూనే కాళ్లతో పెడల్స్‌ను తొక్కడంవల్ల అటు పనీ ఇటు వ్యాయామమూ రెండూ ఏకకాలంలో అయిపోతాయి అంటున్నారు కాలిఫోర్నియాకి చెందిన ఫ్లెక్సిస్పాట్ కంపెనీ తయారీదారులు. డెస్క్‌సైజ్ ప్రొ పేరుతో రూపొందించిన ఈ సరికొత్త బల్లల్లో మరో సౌలభ్యం కూడా ఉంది. నిలబడీ కూర్చునీ పనిచేసుకునేలా ఎత్తుని పైకీ కిందకీ కూడా అడ్జస్ట్ చేసుకోవచ్చు. మంచి ఆలోచనే కదూ.





## నిద్రతో బరువు తగ్గొచ్చు..!

నిద్రలేమితో అనేక ఆరోగ్య సమస్యలు వస్తాయన్న సంగతి తెలిసిందే. కొత్తగా దీని కారణంగా బరువు పెరిగే అవకాశమూ ఉందంటున్నారు లీడ్స్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కార్డియో వాస్క్యులర్ అండ్ మెటబాలిక్ మెడిసిన్‌కు చెందిన పరిశోధకులు. ఇందుకోసం వీళ్లు దాదాపు రెండువేల మందిని ఎంపికచేసి మరీ అధ్యయనం చేశారట. అందులో తక్కువ నిద్రపోయేవాళ్ల ఛాతీ వెడల్పు పెరిగినట్లు తేలింది. ముఖ్యంగా రోజుకి ఎనిమిదీ తొమ్మిది గంటలు నిద్రపోయేవాళ్లతో పోలిస్తే ఆరుగంటలు నిద్రపోయేవాళ్ల ఛాతీ 1.2 అంగుళాలు ఎక్కువ ఉన్నట్లూ అలాగే బరువు కూడా ఎక్కువ ఉన్నట్లూ గుర్తించారు. అంతేకాదు, రోజుకి ఐదు గంటలకన్నా తక్కువ నిద్రపోతుంటే హార్మోన్ల అసమతౌల్యం కారణంగా జీవక్రియావేగం తగ్గుతుందనీ ఆహారం తీసుకోవడం పెరుగుతుందట. బీపీ, చక్కెర శాతం పెరగడంతోబాటు రక్తంలో మంచి కొలెస్ట్రాల్ తగ్గి, చెడు కొలెస్ట్రాల్ పెరిగే అవకాశం కూడా ఉందనీ థైరాయిడ్ సమస్యలూ తలెత్తుతాయనీ పరిశోధకులు భావిస్తున్నారు. కాబట్టి, తస్మాత్ జాగ్రత్త.



## టూకీగా...

ప్రతిరోజూ క్రమబద్ధంగా బాదం తినడం వల్ల రక్తంలో మంచి కొలెస్ట్రాల్ పెరగడంతో బాటు చెడు కొలెస్ట్రాల్ శాతం క్రమేణా తగ్గుతుందని పెన్ స్టేట్ యూనివర్సిటీకి చెందిన పరిశోధకులు పేర్కొంటున్నారు.

★ వేగంగా నడిచే వ్యక్తులతో పోలిస్తే, చాలా నెమ్మదిగా నడిచే వ్యక్తులకు క్యాన్సర్, గుండెజబ్బులు వచ్చే అవకాశం రెండు రెట్లు ఎక్కువని యూనివర్సిటీ ఆఫ్ లీసెస్టర్‌కు చెందిన నిపుణుల ఉవాచ.

## విటమిన్ బి3 లోపిస్తే..!

ఆధునిక వైద్య విజ్ఞానం పెరిగేకొద్దీ సమస్యలూ పెరుగుతూనే ఉన్నాయి. ప్రపంచవ్యాప్తంగా ఏటా 79 లక్షల మంది పిల్లలు రకరకాల లోపాలతోనూ పుడుతున్నారు. దీనికి కారణం బి3 విటమిన్ లోపమేనని ఆస్ట్రేలియాకు చెందిన విక్టర్ చాంగ్ కార్డియాక్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన నిపుణులు పేర్కొంటున్నారు. పిండం పెరుగుదలకు అవసరమైన నికోటినమైడ్ అడినైన్ డైన్యూక్లియోటైడ్ (ఎన్ఏడీ)లోపం కారణంగానే ఈ సమస్యలు తలెత్తుతున్నాయట. ఈ పదార్థం పిండానికి అవసరమైన శక్తి ఉత్పత్తికీ జన్యుపదార్థ అమరికకీ, కణాలమధ్య సమన్వయానికీ తోడ్పడుతుందట. అదే ఇది లోపిస్తే పుట్టే పిల్లల్లో గుండె, వెన్నెముక, మూత్రపిండాల లోపాలతోబాటు గ్రహణంమొర్రి... వంటి సమస్యలు వచ్చే అవకాశం ఉంది. అందుకే గర్భిణుల్లో ఎన్ఏడీ పుష్కలంగా ఉండాలంటే విటమిన్ బి3(నియాసిన్) ఎంతో అవసరం. కానీ దాదాపు 60 శాతం మంది గర్భిణులు విటమిన్ బి3 లోపంతో బాధపడుతున్నారనీ సాధారణంగా ఇది ఆకుకూరలూ మాంసాహారంలో ఎక్కువగా దొరుకుతుందనీ అలా తినడం వీలుకాని పక్షంలో సప్లిమెంట్లను ఇవ్వడం ద్వారా గర్భస్రావ సమస్యల్ని తగ్గించవచ్చని సదరు పరిశోధకులు భావిస్తున్నారు.





‘సముద్రవసనే దేవీ...’ అంటూ భూదేవిని ప్రార్థిస్తూ ఓ మంత్రం చదివి కానీ పొద్దున్నే కాలు కిందపెట్టరు కొందరు. ‘కరాగ్రే వసతే లక్ష్మీ...’ అంటూ కళ్లు తెరుస్తూనే అరచేతిలో దేవతలందర్నీ దర్శించుకుంటారు మరి కొందరు. స్నానం చేస్తూ, దేవుడి దగ్గర దీపం పెడుతూ... ఇలా ప్రతి సందర్భానికీ ఓ మంత్రం జీవితంలో భాగం చాలామందికి. అయితే... రోజులు మారాయ్!

వారు, వీరని తేడా లేదిప్పుడు. కళ్లు తెరవకుండానే ఫోను కోసం తడుముకునే స్మార్ట్ కాలమిది. కళ్లు తెరుస్తూనే సోషల్ మీడియా పాస్‌వర్డ్‌లు పఠించే నెటిజన్ల లోకమిది.

# ట్విటర్... ఇక్కడ మాటే మంత్రం!

కాలేజీ స్టూడెంట్‌నుంచి దేశ ప్రధాని దాకా అందరినీ ఒకే తీరుగా కట్టిపడేస్తున్నాయి సామాజిక మాధ్యమాలు. ఏ విషయం మీద ఎవరేం అభిప్రాయపడుతున్నారో, ఎక్కడేం జరిగిందో తెలుసుకోవడానికే కాదు, ఇంకా చాలా రకాలుగా ఇవి ఉపయోగపడుతున్నాయి. ఈ సామాజిక మాధ్యమ మంత్రాలన్నిట్లోనూ పవర్‌ఫుల్ మంత్రం ఒకటుంది... అదే ట్వీటు మంత్రం.

దేవుళ్లని ప్రసన్నం చేసుకోవాలంటే వేర్వేరు మంత్రాలు కావాలి కానీ సామాజిక దేవుళ్లకి ఒక్క ట్వీటు మంత్రం చాలు. అర్థం కాలేదా?

ఓ ప్రభుత్వ కార్యాలయంలో మీకో పని పడింది. త్రూ ప్రాపర్ ఛానల్... అంటే పద్ధతిగా ఓ దరఖాస్తు పెట్టి, కొన్నాళ్లు వేచిచూసి స్పందన లేకపోతే అప్పుడు కార్యాలయానికి వెళ్తారు. అక్కడ మీ పనిచేయాల్సిన పైవాళ్లను కలవనీయకుండా మధ్యలో గుమాస్తా సైంధవులెవరో అడ్డుపడుతున్నారు. ఆ విషయం పై అధికారి దృష్టికి ఎలా తెస్తారు? పని ఎలా జరుపుకుంటారు?

సింపుల్‌గా ఓ ట్వీట్ చేసి ఆ అధికారిని ట్యాగ్ చేయడమే!

నిమిషాల్లో మీ ఫైల్ కదులుతుంది.

ప్రభుత్వ కార్యాలయాలు, ప్రైవేటు కార్యాలయాలు, వ్యాపార సంస్థలు, సెలబ్రిటీలు, వ్యక్తులు, అధికారులు, ప్రజాప్రతినిధులు... ఎవరితో పని పడినా సరే... ఒక్క ట్వీటు చాలు గురూ!

ఇంకా నమ్మకం కలగడం లేదా...? అయితే ఇవి చదవండి.

## సుష్మ ట్వీట్లకు అభిమానులు ఫిదా

‘మీరు మా దేశ ప్రధాని అయితే మా దేశం ఎంత బాగుండేదో...’ అని పొరుగుదేశం పౌరురాలు మన దేశ మంత్రిని బహిరంగంగా ప్రశంసించారంటే ఆ మంత్రి ఎంత గొప్పవారై ఉండాలి? పైగా ఆమెది పాకిస్థాన్. ట్వీట్లతో హృదయాలను గెలుచుకోవడంలో సుష్మాస్వరాజ్ అందరికన్నా ముందుంటారు. విదేశాంగ శాఖమంత్రిగా వీసా, పాస్‌పోర్టులు ఇప్పించే విషయంలో తక్షణం స్పందిస్తూ ఆమె దేశదేశాల్లోనూ అభిమానులను సంపాదించుకున్నారు. విదేశీ పత్రికలు ఆమెకు ‘ట్విటర్ రాయబారి’ అన్న పేరే పెట్టేశాయి. ఇటీవల ఓ పాకిస్థాన్ మహిళ వైద్యంకోసం భారత్ రావాల్సి ఉందనీ వీసా ఇప్పించమనీ కోరుతూ సుష్మకి ట్వీట్ చేశారు. ఆ ఏర్పాట్లు చూడమంటూ సుష్మ పాకిస్థాన్‌లో ఉన్న భారతహైకమిషన్‌కి ఆదేశాలు జారీచేశారు. వారు వెంటనే రంగంలోకి దిగారు. గంటల్లోనే స్పందన చూసి ఆశ్చర్యపోయిన ఆ మహిళ సుష్మను కొనియాడుతూ ‘మీరు మా దేశ ప్రధాని అయితే మా దేశం ఎంతగా మారిపోయేదో’ అని ట్వీట్ చేశారు. అంతటితో ఊరుకోకుండా ‘మా దేశానికి ఆ అర్హత లేదులెండి’ అని కూడా అనేశారు. ఆమె ట్వీట్లు పత్రికల్లో పతాక శీర్షికలయ్యాయి.

సుష్మాస్వరాజ్ విదేశాంగశాఖ మంత్రి అయినప్పటి నుంచీ కేవలం ఆమె వల్ల ఆ శాఖ వార్తల్లో ఉంటోందంటే అతిశయోక్తి కాదు. అరబ్ దేశంలో బందీగా చిక్కుకుపోయిన బాలిక, పాస్‌పోర్టూ డబ్బూ లేకుండా బెర్లిన్ విమానాశ్రయంలో ఒంటరిగా ఉన్న మహిళ, అక్రమ రవాణా బాధితురాలిగా జొహన్నెస్‌బర్గ్‌లో బందితురాలైన మహిళ, యెమన్‌లో చిక్కుకుపోయిన ఓ చిన్నారి... ఇలాంటి ఎందరినో కేవలం ట్వీట్ విజ్ఞప్తికి స్పందించి క్షేమంగా స్వదేశం రప్పించారామె. విదేశీయులను వివాహం చేసుకుని పాస్‌పోర్టు పొందడంలో సమస్యలు ఎదుర్కొన్నవాళ్లు ఎందరో ట్విటర్ వారధిగా సుష్మ సాయంతో ఇబ్బందుల్లోంచి బయటపడ్డారు. సుష్మ సత్వర స్పందనను చూసి కొందరు ఆమెను ఇబ్బంది పెట్టడానికీ ప్రయత్నించారు. అయినా సంయమనం కోల్పోకుండా సుష్మ ఇచ్చే సమాధానాలు అభిమానుల్ని మరింతగా పెంచాయి. ఆ మధ్య ఓ వ్యక్తి ‘నేను మార్స్ మీద చిక్కుకుపోయాను. మంగళ్‌యాన్ 1లో పంపించిన ఆహారం అయిపోవచ్చింది. మంగళ్‌యాన్2 ఎప్పుడొస్తుంది?’ అంటూ సుష్మనూ, ఇస్రోనూ ట్యాగ్‌చేస్తూ ట్వీట్ చేశాడు. ‘మీరెక్కడున్నా సరే, అక్కడి భారత హైకమిషన్ మీకు సహాయపడుతుంది’ అంటూ సుష్మ ఇచ్చిన సమాధానం చూసి నెటిజన్లు ఫిదా అయిపోయారు. మధ్య మధ్యలో ‘గుర్తుకొస్తున్నాయి’ అంటూ తన పాత చిత్రాలనూ అభిమానులతో పంచుకుంటూ మరింతగా వారి ప్రేమకు పాత్రురాలవుతున్నారామె.





Hijaab asif @Hijaab_asif · 18h
Replying to @SushmaSwaraj @IndiainPakistan
Lots and lost of love and respect from here. Wish you were our Prime Minister, this country would've changed!

## మౌనంగా మనసు దోచేస్తారు!

శిల్పీ తివారీని పలకరిస్తే ప్రధాని మోదీని ప్రశంసలతో ముంచెత్తుతుంది. 'ఒక దేశ ప్రధాని ఎంత బిజీగా ఉంటారో అందరికీ తెలుసు. అయినా నాలాంటి ఒక సామాన్యురాలి ట్వీట్‌ని చూసి స్పందించారంటే ఆయనది ఎంత గొప్ప హృదయమో...' అంటూ పొగిడేస్తుంది. కోయంబత్తూరులోని ఇషా యోగాకేంద్రంలో ఆదియోగి విగ్రహావిష్కరణ సందర్భంగా ప్రధాని మోదీ శివుడి బొమ్మ ఉన్న ఓ అందమైన నెమలిపింఛం రంగు ఉత్తరీయాన్ని ధరించారు. టీవీలో ఆ కార్యక్రమం చూసిన శిల్పికి ప్రధాని వేసుకున్న స్టోల్ చాలా నచ్చేసింది. 'నాకు ఈ స్టోల్ కావాలి' అంటూ ట్వీట్ చేసి ఏకంగా ప్రధానినే ట్యాగ్ చేసింది. మర్నాటికల్లా ఆ స్టోల్‌తో పాటు ప్రధాని సంతకం చేసిన ఓ ఉత్తరం కూడా శిల్పికి అందింది. ఇక ఆమె ఆనందానికి హద్దులుంటాయా? 'ఆదియోగి బొమ్మ ఉన్న స్టోల్‌ని ఆధునిక కర్మయోగి అయిన మన ప్రధాని నాకు పంపించారోచ్...' అంటూ అందరికీ అసూయ కలిగేలా ట్విటర్‌లో ప్రకటించింది.

ప్రధాని మోదీ ట్విటర్‌లో చాలా చురుగ్గా ఉంటారు. తనను ఉద్దేశించి ఎవరు ట్వీట్ చేసినా స్పందిస్తారు. ఇటీవల మహిళల క్రికెట్ జట్టు ప్రపంచ కప్ ఫైనల్ ఆడుతున్నప్పుడు జట్టులోని ప్రతి సభ్యురాలి పేరుమీదా ప్రధాని ట్వీట్ చేసి వారి వారి ప్రతిభను ప్రత్యేకంగా పేర్కొంటూ శుభాకాంక్షలు తెలపడం నెటిజన్లను ఆకట్టుకుంది. సమయోచితంగా మెప్పించే సమాధానా లివ్వడంలో మోదీ కూడా ముందువరసలో ఉంటారు. అజిత్ సింగ్ అనే వ్యక్తి ఒక ట్వీట్ చేశాడు... 'నువ్వు మోదీ కోసం పనిచేస్తావా... అని నన్ను ఒకరు అడిగారు. కాదు, మోదీనే నాకోసం పనిచేస్తారు అని చెప్పాను' అని అతడు ట్వీట్ చేశాడు. ఆ ట్వీట్‌కి మోదీ ఏమని సమాధానమిచ్చారో తెలుసా? 'అవును... భారతీయులందరికీ ప్రధాన సేవకుడిని అయినందుకు నాకు సంతోషంగా ఉంది' అని. ఊహించని ఈ జవాబుకు అజిత్ సింగ్ పరిస్థితి ఏమై ఉంటుందో ఆలోచించండి. తక్కువ మాటల్లో చాలా హుందాగా సమాధానమిచ్చి సామాన్యుల మనసు దోచేస్తారు ప్రధాని మోదీ.






## సహాయానికి సదా సిద్ధం

ట్విటర్ వారధిగా తమ శాఖ వినియోగదారులకు అవసరమైన సాయం అందించడంలో ముందు నిలుస్తున్నారు రైల్వే శాఖ మంత్రి సురేష్ ప్రభు. 'సహాయం' అన్న పదానికి అర్థం చెబుతుంది ఆయన ట్విటర్ హ్యాండిల్. ఓసారి డెహ్రాడూన్‌లోని ఏషియన్ స్కూల్ విద్యార్థులు రైల్లో ప్రయాణిస్తున్నారు. మంచు కారణంగా వారి రైలు ఏడుగంటలపాటు నిలిచిపోయింది. ఆ రైల్లో భోజనాల ఏర్పాటు లేదు. దాంతో ఓ విద్యార్థి తమ పరిస్థితిని రైల్వేమంత్రికి ట్వీట్ చేశాడు. వెంటనే స్పందించిన మంత్రి పిల్లలందరికీ ఫుడ్ ప్యాకెట్లతో పాటు నీళ్ల సీసాలనూ సరఫరా చేయించారు. రైల్లో ఒంటరిగా ప్రయాణిస్తున్న నమ్రతామహాజన్ తన సీట్లో కూర్చున్న ఓ వ్యక్తిని లేవమన్నందుకు అతడు వేధించడం మొదలెట్టాడు. భౌతికదాడికి దిగుతున్న అతడిని తప్పించుకోవడమెలాగో తెలియని ఆమె వెంటనే మంత్రికి ట్వీట్ చేసింది. కాసేపట్లో రైల్వే పోలీసులు వచ్చి ఆమెకు అండగా నిలిచారు.



పంకజ్ జైన్ పక్షవాతంతో బాధపడుతున్న తండ్రిని తీసుకుని ప్రయాణిస్తున్నారు. స్టేషన్‌లో మూడు నిమిషాలే ఆగే రైలు నుంచి తండ్రిని తీసుకుని దిగడం కష్టమని భావించిన ఆయన రైలును పది నిమిషాలు ఆపాలనీ, చక్రాలకుర్చీ కావాలనీ కోరుతూ మంత్రికి ట్వీట్ చేశారు. రైలు స్టేషన్‌లో ఆగుతూనే చక్రాల కుర్చీతో పాటు స్టేషన్‌మాస్టర్‌తో సహా సిబ్బంది అంతా వారి సహాయానికి వచ్చారు. రైల్వే మంత్రిత్వ శాఖ కూడా సహాయం కోరే ట్వీట్లకు తక్షణం స్పందిస్తోంది. ఇటీవల ఓ రైల్వేస్టేషన్ క్యాంటీన్ భోజనంలో బొద్దింక వచ్చిందని వినియోగదారు ఫిర్యాదుచేయగా అధికారులు చర్య తీసుకుని ఆ క్యాంటీన్‌కి రూ.10 వేలు జరిమానా విధించారు. మరో వ్యక్తి రైలు మరుగుదొడ్లో దుస్తులు మార్చుకుంటూండగా బంగారుగొలుసు పోయిందని మంత్రికి ఫిర్యాదు చేశాడు. మంత్రి ఆదేశాలతో రైల్వే సిబ్బంది రెండు కిలోమీటర్ల మేర పట్టాలపై గాలించి అతడి గొలుసు వెదికిపెట్టారు. ఇలాంటి సందర్భాలెన్నో.

## అంతర్యుద్ధాన్ని లోకానికి చాటి...

బనా అల్- అబెద్ ఎనిమిదేళ్ల చిన్నారి. ఇంకెక్కడైనా ఉంటే ఆ వయసు పిల్లల్లాగే బడికెళ్తూ ఆటపాటలతో గడిపేసేదేమో. కానీ అంతర్యుద్ధంతో అతలాకుతలమైన సిరియాలోని అలెప్పో నగరంలో నివసించిన బనా యుద్ధాన్ని ఎంత దగ్గరగా చూసిందో ఆమె ట్వీట్లు ప్రపంచానికి చాటాయి. బనా తల్లి ఫాతిమా ఇంగ్లిష్ టీచర్. ఆమె కూతురికి ఇంట్లోనే ఇంగ్లిష్ నేర్పించడంతోపాటు ఆమె పేరు మీద ట్విటర్ ఖాతా తెరిచారు. తల్లి సహాయంతో బనా తమ చుట్టూ ఉన్న పరిస్థితులను ట్వీట్‌ల ద్వారా ప్రపంచానికి తెలపడం మొదలుపెట్టింది. ఆమె ఖాతా ప్రారంభించిన కొద్ది రోజుల్లోనే మూడున్నర లక్షల మందికి పైగా ఆమెను అనుసరించారు. ట్వీట్‌లలో అక్కడి పరిస్థితులను వివరిస్తూ 'పిల్లలకెందుకు ఈ శిక్ష' అని ప్రశ్నించేది. బడికెళ్లలేకపోతున్నాను, స్నేహితులతో ఆడుకోవడానికీ లేదంటూ బిక్కమొహంతో బనా చెప్పే ముద్దుమాటల వీడియోలకు ప్రపంచం ఫిదా అయింది. బాంబులు పేలుతున్నాయనీ, అర్ధరాత్రిళ్లు కాల్పుల చప్పుడుకి ఉలిక్కిపడి లేస్తున్నానంటూ బనా చేసిన ట్వీట్లను పలువురు ప్రముఖులు రిట్వీట్ చేసేవారు. ఎట్టకేలకు సిరియా సంక్షోభం సద్దుమణిగింది. బనా కుటుంబం ప్రస్తుతం టర్కీలో ఆశ్రయం పొందుతోంది. ట్వీట్లతో ప్రపంచవ్యాప్తంగా అభిమానుల్ని సంపాదించుకున్న ఈ చిన్నారి త్వరలో రచయిత్రి కానుంది. ఆమె పుస్తకాన్ని ప్రచురించడానికి ప్రముఖ ముద్రణ సంస్థ సిమోన్ అండ్ షుస్టర్ ముందుకొచ్చింది. ప్రపంచంలో ఎక్కడా యుద్ధం జరగకూడదు అనే బనా తన పుస్తకం ద్వారా సిరియాలో ఏం జరిగిందో చెప్తానంటోంది. పుస్తకం పేరు 'డియర్ వరల్డ్'.



# కశ్మీర ట్వీటుకళిక

సరిహద్దు ఉద్రిక్తత, తీవ్రవాదుల చొరబాట్లు, వేర్పాటువాదుల ఆందోళనలు... కాశ్మీరం అంటేనే కల్లోలానికి మారుపేరు అనుకుంటాం. అలాంటి చోట పిల్లల చదువులు ఎలా సాగుతాయి? భవిష్యత్తు గురించి వారు ఏమి ఆలోచిస్తారు? ఇవి తెలియాలంటే సబా హాజీ ట్విటర్ ఖాతాను అనుసరించాలి. సామాజిక మాధ్యమాల సాయంతో ఏం చేయవచ్చో నిరూపించిన సాధారణ కశ్మీరీ యువతి సబా. దుబాయ్‌లో పెరిగి, బెంగళూరులో చదువుకుని వెళ్లిన ఆమెకు కశ్మీర్‌లోని వాస్తవ పరిస్థితులకూ, బయటి ప్రపంచం కశ్మీర్ గురించి తెలుసుకుంటున్న విషయాలకూ మధ్య పొంతన లేదనిపించింది. ఆంగ్లం బాగా వచ్చిన ఆమె అక్కడి వాస్తవ పరిస్థితులను తన ట్వీట్‌లలో తెలపడం మొదలుపెట్టింది. ఎక్కువ ట్వీట్లు చేసేవారినీ, ఎక్కువ మంది అనుసరించేవారినీ ట్విటర్ సెలబ్రిటీలంటారు. ట్విటర్ ద్వారా ముఖ్యమైన అంశాలపై చర్చకు తెరతీస్తూ, అర్థవంతమైన సంభాషణ జరుపుతూ, వ్యాఖ్యలూ రిట్వీట్లతో తమ అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పేవారి గురించి ట్విటర్ ఇండియా ఒక జాబితా తయారు చేయగా టాప్ 20లో సబాకి చోటు దక్కింది. కశ్మీర్ నుంచీ క్రికెట్ వరకూ సినిమాల నుంచీ పుస్తకాల వరకూ అన్ని అంశాలపై ఎక్కువగా ట్వీట్లు చేసే సబా కొద్దికాలంలోనే ట్విటర్ సెలబ్రిటీ అయిపోయింది. ఆమె కుటుంబానికి చెందిన ట్రస్టు జమ్మూలోని ఓ మారుమూల గ్రామంలో పాఠశాల నిర్వహిస్తోంది. సబా దానికి డైరెక్టరుగా విధులు నిర్వహిస్తూనే పిల్లలకు పాఠాలూ చెప్తోంది. అంతర్జాల కనెక్టివిటీ, విద్యుత్తు సరఫరా అంతంత మాత్రంగా ఉండే ఆ పల్లెలో ఫోనులో వినియోగించే ట్విటర్ ఆమెకు చేదోడయింది. ట్విటర్‌లో తనకున్న పలుకుబడిని ఉపయోగించుకుని ఆమె స్కూల్‌కి అవసరమైన సరంజామా అంతా విరాళాలుగా పొందింది. పుస్తకాలూ బ్యాగులతో మొదలుపెట్టి ల్యాప్‌టాప్‌లూ ఎంపీ 3 ప్లేయర్లతో సహా పిల్లలకు కావలసిన సామగ్రి అంతా సమకూర్చి పల్లెలో అంతర్జాతీయ స్థాయి పాఠశాలను తీర్చిదిద్దింది. అంతేకాదు, సబా విజ్ఞప్తి మేరకు వేర్వేరు ప్రాంతాలనుంచి యువతీ యువకులు వలంటీర్లుగా వచ్చి పిల్లలకు పాఠాలు చెప్తున్నారు. వారికి వసతి, భోజన సదుపాయాన్ని మాత్రం సబా ఏర్పాటుచేస్తోంది. ట్విటర్ వేదికపై సబా పాఠశాల ఇప్పుడు అంతర్జాతీయ ఖ్యాతి పొందింది.





# రిట్వీట్ రికార్డు... ఉచితంగా చికెన్ నగెట్స్

అమెరికన్ టీనేజర్ కార్టర్ విల్కర్‌సన్‌కి వెండీస్ చికెన్ నగెట్స్ అంటే పిచ్చి ఇష్టం. ఓరోజు ఏమీ తోచక ఆ సంస్థకి ఒక ట్వీట్ చేశాడు. 'నా ట్వీట్ ఎన్ని రిట్వీట్‌లైతే మీరు నాకు ఏడాది పాటు చికెన్ నగెట్స్ ఉచితంగా ఇస్తారు?' అని. 'కోటీ 80 లక్షల రిట్వీట్లు...' అని చెప్పిందా కంపెనీ. ఇంకేముంది రిట్వీట్‌ల జోరు మొదలైంది. ఎంతగా అంటే అప్పటివరకూ అత్యధిక రిట్వీట్లు సాధించిన అమెరికన్ సెలబ్రిటీ ఎలెన్ డిజెనెరస్ రికార్డును మించిపోయింది కార్టర్ ట్వీట్. 2014లో ఆస్కార్ అవార్డుల వ్యాఖ్యాతగా వ్యవహరించారు ఎలెన్. అవార్డుకి నామినేట్ అయిన పలువురు నటీనటులతో ఆమె తీసుకున్న సెల్ఫీ అత్యధిక రిట్వీట్‌లు పొంది రికార్డు సృష్టించింది. తన రికార్డు చెరిగిపోకుండా, కార్టర్ జోరుకి అడ్డుకట్ట వేయడానికి ఎలెన్ సరదాగా ప్రయత్నించింది. గతంలో తాను రికార్డు సాధించిన ట్వీట్‌ని మళ్లీ మళ్లీ రిట్వీట్ చేయమంటూ తన టీవీ షోలో అభిమానులకు పిలుపునిచ్చింది. అయినా ఫలితం లేకపోయింది.




కోటీ 80లక్షల రిట్వీట్లు సాధించకపోయినప్పటికీ ఎలెన్ రికార్డును అధిగమించి కార్టర్ సాధించిన రికార్డును వెండీస్ గుర్తించింది. ఏడాది పాటు అతడికి ఉచితంగా చికెన్ నగెట్స్ ఇవ్వడానికి అంగీకరించింది. అంతేకాదు ఆ అబ్బాయి పేరు మీద అనాథ పిల్లల కోసం పనిచేసే ఓ ఫౌండేషన్‌కి లక్ష డాలర్లు విరాళం కూడా ఆ సంస్థ ఇవ్వడం విశేషం. అలా ఒక్క ట్వీట్‌తో కార్టర్ అంతర్జాలంలో చికెన్ నగెట్ బోయ్‌గా ఫేమస్ అయిపోయాడు.



# ట్విటర్ రాణి

హ్యారీపోటర్ సిరీస్‌తో యువత హృదయాలను కొల్లగొట్టిన రచయిత్రి జె.కె.రౌలింగ్. నిస్సంకోచంగా తన అభిప్రాయాలను వెల్లడించే రౌలింగ్‌ని అభిమానులు క్వీన్ ఆఫ్ ట్విటర్ అంటుంటారు. అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ అభిప్రాయాలను మొదటినుంచీ వ్యతిరేకిస్తున్న ఆమె ఒకసారి ఏకంగా ఆయన్ని తన నవలల్లోని విలన్ వోల్డ్‌మోర్ట్‌తో పోల్చారు. ట్రంప్‌ని విమర్శించడానికి ఆమె ఏ సందర్భాన్నీ వదులుకోరు. అలాంటి ఆమె ఇటీవల ఒక పొరపాటు చేసి ట్రంప్‌కే ట్విటర్‌లో క్షమాపణలు చెప్పారు. ఆమధ్య కొందరు పిల్లలు ట్రంప్‌ని కలిశారు. వారిలో చక్రాల కుర్చీలో ఉన్న ఒక చిన్నారి ట్రంప్‌వైపు ఆసక్తిగా చూస్తుండగా ట్రంప్ ఆ చిన్నారివైపు కన్నెత్తి చూడలేదు. వార్తల్లో ఈ దృశ్యం చూసిన రౌలింగ్ వైకల్యం ఉన్న చిన్నారి పట్ల ట్రంప్ నిర్లక్ష్య వైఖరిని ఖండిస్తూ ట్వీట్ చేశారు. అయితే పూర్తి వీడియోలో ట్రంప్ ఆ బాలుడితో మాట్లాడిన దృశ్యాలు ఉన్నాయి. ఈ విషయం ఇతరుల ద్వారా తెలుసుకున్న రౌలింగ్ వెంటనే స్పందించారు. తాను పొరపడ్డాననీ తొందరపడి వ్యాఖ్యానించకుండా ఉండాల్సిందనీ తప్పు ఒప్పుకున్నారు. ట్రంప్‌కీ, ఆ పిల్లవాడికీ, అతని కుటుంబానికీ కూడా ట్విటర్ ద్వారానే బహిరంగంగా క్షమాపణలు చెప్పారు. ఈ చర్యతో ఆమె అభిమానులకు మరింతగా చేరువయ్యారు.




# కంటతడి పెట్టించారు

ఓ తాతా మనవరాలు కలిసి గత ఏడాది నెటిజన్లను కంటతడి పెట్టించారు. అమెరికాలోని ఓక్లహామాకి చెందిన కెల్సీ విచారంగా కూర్చున్న తన తాతయ్య కెన్నీ హార్మన్ ఫొటోని ట్వీట్ చేసింది. ఆయన స్వయంగా బర్గర్లు తయారుచేసి తన ఆరుగురు మనవలూ మనవరాళ్లను విందుకి పిలిచారనీ తాను తప్ప ఇంకెవరూ రాకపోవడంతో తాతయ్య బాధపడ్డారనీ రాసింది. ఆ ట్వీట్ కాస్తా వైరల్ అయిపోయింది. లక్షల్లో రిట్వీట్ అయింది. 'తాతయ్య ప్రేమగా పిలిస్తే వెళ్లరా' అంటూ ఆ మనవలను అందరూ దుమ్మెత్తిపోశారు. 'మీరు మనుషులేనా' అంటూ ఎగతాళి చేశారు. దాంతో ఒక మనవడు వెళ్లి తాతయ్యను కలిసి ఆ ఫొటో ట్వీట్ చేస్తూ 'దయచేసి మమ్మల్ని వేధించడం ఆపండి. తాతయ్య మమ్మల్ని క్షమించారు. రిట్వీట్లతో తనని ఫేమస్ చేసినందుకు మీ అందరికీ కృతజ్ఞతలు చెప్పమన్నారు' అంటూ ట్వీట్ చేశాడు. అయినా వేధింపులు ఆగకపోయేసరికి మళ్లీ కెల్సీ కలగజేసుకుంది. తనని ఫేమస్ చేసిన ఇంటర్నెట్ మిత్రులను కలుసుకోవడానికి తాతయ్య ఆసక్తిగా ఉన్నారనీ వీలైనవారు ఫలానా రోజున రావచ్చనీ ట్వీట్ చేసింది. దాంతో పలువురు యువతీయువకులు ఆయన ఇంటి ముందు క్యూ కట్టారు. రెండు డాలర్లకొకటి చొప్పున బర్గర్ కొనుక్కుని తాతయ్యతో కలిసి తిన్నారు. 'తాతయ్యతో కలిసి బర్గర్ తిన్నాను' అని రాసివున్న టీషర్టూ టోపీలను కొనుక్కుని మరీ పెట్టుకుని ఫొటోలకు పోజులిచ్చారు.




చూశారుగా... ట్విటర్ మహిమ!

మన దేశ రాజకీయనాయకుల్లో మొట్టమొదట ట్విటర్‌ను ఎక్కువగా వాడడం మొదలుపెట్టింది కాంగ్రెస్ నేత శశిథరూర్. అప్పట్లో ఆయన్ని ట్విటర్ మినిస్టర్ అనేవారు. ఆ తర్వాత ప్రధాని మోదీ అతి త్వరగా ఈ మాధ్యమాన్ని అందిపుచ్చుకున్నారు. సెల్ఫీలతో, సోషల్ మీడియా జార్గాన్‌తో యువతరాన్ని ఆకట్టుకున్నారు. ఓసారి ఈ విషయంపై మాట్లాడుతూ ఆయన 'మనం విజ్ఞాన, సమాచార యుగంలో జీవిస్తున్నాం. ఇక్కడ సోషల్ మీడియా అంటేనే ఇతరులగురించి వినడం, పంచుకోవడం, సంభాషించడం...' అని చెప్పారు. ఆ తర్వాత కేంద్రమంత్రులూ, ముఖ్యమంత్రులూ, ఇతర నాయకులూ సామాజిక మాధ్యమాలను అనుసరించడం మొదలెట్టారు. అయితే వారిలో చాలామంది ట్విటర్‌లో చురుగ్గానే ఉన్నా సుష్మాస్వరాజ్, సురేష్ ప్రభుల స్థాయిలో ప్రజలకు చేరువైన వారు లేరు.

మనదేశంలో ట్విటర్ వినియోగం 2016లో బాగా పెరిగింది. అంతర్జాతీయ స్థాయిలో సంభాషణలకు మాధ్యమంగా ఉన్న ట్విటర్‌లో భారతీయులు క్రియాశీలంగా పాల్గొన్నారు. దిల్లీలో కాలుష్యం గురించి మొదలైన చర్చ పెద్ద నోట్ల రద్దుతో పతాక స్థాయికి చేరింది. ఒలింపిక్స్‌లో భారతీయ మహిళల ప్రతిభ, టీ20 ప్రపంచకప్ క్రికెట్, ఫిల్మ్‌ఫేర్ అవార్డులు... ఇలాంటి అంశాలన్నిటిపై స్పందించి యాక్టివ్ ట్విటర్ వినియోగదారుల జాబితాలో చేరిపోయారు మనవారు.

★ ★ ★

సుబ్బారావు ట్విటర్‌లో చాలా చురుకు. గంటకో ట్వీట్ చేస్తూనే ఉంటాడు. అతడికి పెద్ద ఫాలోయర్ వెంగళప్ప.

"ఉదయం కాఫీ తాగుతున్నప్పుడు 'అబ్బ, కంట్లో నలక పడిందండీ' అంది మా ఆవిడ కన్ను నులుముకుంటూ. 'అంత పెద్ద కళ్లుంటే పడదా మరి' అన్నాను నవ్వుతూ. మా ఆవిడ ఎంత మురిసిపోయిందో, స్వీట్ చేసిపెట్టింది..." ట్వీట్ చేశాడు సుబ్బారావు.

"సాయంత్రం టీ తాగుతున్నప్పుడు 'అబ్బ, నోట్లో ఈగ దూరిందండీ' అంది మా ఆవిడ. 'అంత పెద్ద నోరుంటే దూరదా మరి' అన్నాను నవ్వుతూ. కప్పు నా మొఖాన కొట్టి వెళ్లింది, ఎక్కడ తేడా వచ్చింది గురువుగారూ..." ట్వీటాడు వెంగళప్ప.

అర్థమైందిగా, అదీ విషయం. అక్షరం ఆటంబాంబుకన్నా శక్తిమంతం. అర్థమెరిగి, ఆచితూచి ఉపయోగిస్తే ఎంత మేలో సందర్భశుద్ధి లేకుండా, ఉచితానుచితాలు యోచించకుండా వాడితే అంత ప్రమాదం.

అందుకే, ట్వీట్ మంత్రం వేసేటప్పుడు జర భద్రం..! ★









**వారాంతాలంటే కొందరికి సినిమాలూ, షికార్లూ, కుటుంబంతో కాలక్షేపం... మరికొందరికి ఆ వారం వేసిన బట్టల్ని ఉతికి, ఆరబెట్టి, ఇస్త్రీ చేసుకోవడంతోనే సరిపోతుంది. 'ఇకపైన ఆ పనిని మాకు అప్పగించేసి మీ విలువైన సమయాన్ని ఇష్టమైన పనులకు కేటాయించండి' అంటోంది పీకేసీ లాండ్రీ సొల్యూషన్స్.**

# మీ బట్టలు మేం ఉతికిస్తాం!

ప్రేమంత్ కుందుర్తి, చైతన్య అమ్మినేని... ఇద్దరూ స్నేహితులు. ఎంబీఏ చేసిన వీరు సొంత కంపెనీ పెట్టాలనుకున్నారు. అందుకు ఉద్యోగ అనుభవం ఉంటే మంచిదని ప్రేమంత్ 'సైనోడ్ ఇండియా' సంస్థలో, చైతన్య 'నిసాన్ ఇండియా మోటార్స్'లో కొన్నాళ్లు పనిచేశారు. మరోవైపు వ్యాపారం గురించి ఆలోచించేవారు. ఆ సమయంలో దాదాపు 20 వరకూ ఆలోచనలు చర్చకు వచ్చాయి. చివరకు లాండ్రీ సేవల విభాగంలో అడుగు పెట్టాలనుకున్నారు. 2015లో డిసెంబరులో పీకేసీ లాండ్రీని ప్రారంభించి, హైదరాబాద్‌లోని హైటెక్‌సిటీ ప్రాంతంలో సర్వీసులు అందించడం మొదలుపెట్టారు. దీనికోసం వెబ్‌సైట్(పీకేసీలాండ్రీస్‌డాట్‌కామ్), ఆప్‌కూడా తీసుకొచ్చారు. బట్టల్ని ఉతికి ఇస్త్రీ చేసివ్వడం, ఇస్త్రీ, డ్రై క్లీనింగ్, డైయింగ్, డార్నింగ్... వీరందించే సేవల్లో ఉన్నాయి. ఆన్‌లైన్లో లాండ్రీ సేవలకు అలవాటు పడ్డానికి స్థానికులకు దాదాపు ఆరు నెలలు పట్టింది. ఆ తర్వాత ఆన్‌లైన్లోకంటే కూడా చాలామంది ఫోన్లు చేసి ఆర్డర్లు ఇవ్వడం మొదలుపెట్టారు. 'వినియోగదారులు ఫోన్ చేయడానికి కారణం, బట్టల్ని ఎప్పుడు తిరిగిస్తారో తెలుసుకునే వీలుండటమే'నంటారు ప్రేమంత్. వినియోగదారులు ఫోన్ చేస్తే వారి ఇంటికి వెళ్లి బట్టలు తీసుకొని తిరిగి ఇంటి దగ్గరకే అందిస్తారు వీరు. మరోవైపు సేవల్ని విస్తరించడానికి గేటెడ్ కమ్యూనిటీలూ, విల్లాలూ, కాలనీ సంఘాలతో మాట్లాడేవారు. తమ సేవలు మిగిలిన వారికి ఎలా భిన్నమైనవో వివరించేవారు. తమ ప్లాంట్‌లకు పిలిచి ప్రత్యక్షంగా చూపేవారు. అక్కడ పరిశుభ్రమైన నీరు, నాణ్యమైన డిటర్జెంట్‌లూ, రసాయనాలతో పాటు సరికొత్త యంత్రాలు కూడా ఉండేవి. ఆ తేడా గమనించి చాలామంది పీకేసీ సేవల్ని పొందడానికి ఆసక్తి చూపేవారు. ఏడాది తిరిగేసరికి హెయిర్ సెలూన్లూ, బొటిక్‌లూ, స్పాలూ, హోటళ్లూ, రిసార్ట్‌లూ వీరి ఖాతాదారుల జాబితాలో చేరాయి.




### సొంత ప్లాంట్లు

ఇప్పుడైతే ఆప్, వెబ్‌సైట్, ఫోన్‌లతోపాటు వాట్సాప్, ఫేస్‌బుక్ పేజీద్వారా తెలియజేసి పీకేసీ సేవలు పొందే వీలుంది. వినియోగదారుడు సమాచారమిచ్చిన గంటలో సంస్థ ప్రతినిధి వెళ్లి బట్టల్ని తీసుకుంటారు. పెట్టుబడి పరిమితుల దృష్ట్యా మొదట్లో దుస్తుల్ని సేకరించి ప్లాంట్‌లను నిర్వహించే సంస్థలకు ఇచ్చేది పీకేసీ. అప్పటివరకూ ఆయా ప్లాంట్‌ల సామర్థ్యం మేరకు ఆర్డర్లు తీసుకునేవారు. ఆ దశలో రెండు ప్లాంట్ల యజమానులు వాటిని అమ్మాలనుకున్నట్టు పీకేసీకి చెప్పారు. దాంతో వాటిని సొంతం చేసుకున్నారు. ఈ రెండు ప్లాంట్లూ ఒకదానికొకటి దూరంగా ఉండటంతో మార్కెట్‌ను విస్తరించుకోగలిగారు. లాండ్రీ సేవల్లో నాణ్యతతోపాటు సమయానికి అందించడం కూడా ముఖ్యం. చాలా ప్లాంట్‌లు ఆదివారం నాడు పనిచేయవు. వినియోగదారులు కోరిన టైమ్‌కి అందివ్వాలంటే సెలవు రోజుల్లోనూ పనిచేయాలి. ఆ ప్లాంట్‌లు సొంతమయ్యాకే అది సాధ్యమైంది. ఇప్పుడు రెండు, మూడు షిఫ్టుల్లోనూ పనిచేస్తున్నారు. సిబ్బంది కొరత ఉంటే వ్యవస్థాపకులే రాత్రుళ్లు పనిచేసేవారు. ప్రస్తుతం ఈ సంస్థలో 50 మంది వరకూ ఉద్యోగులున్నారు. వీరి సేవల్ని దాదాపు హైదరాబాద్ మొత్తానికి విస్తరించారు. 'మేం దుస్తుల రకాన్ని బట్టి వేర్వేరు పద్ధతుల్లో శుభ్రం చేస్తాం. దానివల్ల వాటి మన్నిక పెరుగుతుంది. ఈ రంగంలో పోటీ పడాలంటే నాణ్యమైన సేవలు అందివ్వడం ఒక్కటే మార్గం. దానివల్ల అంతిమంగా అసంఘటితంగా ఉన్న రూ.2లక్షల కోట్ల లాండ్రీ పరిశ్రమకు మేలు జరుగుతుంది' అంటారు ప్రేమంత్. సాధారణంగా వర్షాకాలంలో బట్టలు ఉతికి ఆరేయడానికి ఇళ్లల్లో ఇబ్బంది అవుతుంది. ప్లాంట్‌లలో వాషర్, స్పిన్నర్, డ్రైయర్లు ఉంటాయి కాబట్టి వీరికది సమస్య కాదు. అందుకే ఈ కాలంలో డిమాండ్ ఎక్కువగా ఉంటుందంటారు ప్రేమంత్.

### ఫ్రాంఛైజీ ఇస్తారు

పీకేసీ విస్తరణకు పెట్టుబడుల్ని వెంచర్ క్యాపిటలిస్టులూ, ఏంజిల్ ఇన్వెస్టర్ల నుంచి కాకుండా స్నేహితులూ, బంధువుల నుంచి తీసుకుంటున్నారు. అలా ప్రేమంత్, చైతన్యలకు శ్రీకాంత్, సుజిత్ తోడయ్యారు. వీరిద్దరూ సంస్థలో ఉద్యోగులుగానూ ఉన్నారు. స్థానికంగా యజమాని ఉంటే సంస్థ నిర్వహణ, విస్తరణకు బాగుంటుందని ఫ్రాంఛైజీలు ఇవ్వాలని చూస్తున్నారు. ఇప్పటికే సంగారెడ్డిలో ఒక ఫ్రాంఛైజీని ఏర్పాటుచేశారు. విజయవాడ, పుణె, బెంగళూరులలో ఫ్రాంఛైజీల గురించి చర్చలు నడుస్తున్నాయి. ప్లాంట్‌నీ, సిబ్బందినీ ఏర్పాటుచేసుకుంటే సాంకేతిక సేవలూ, నిర్వహణ ప్రణాళిక అమలులో వారికి శిక్షణ ఇస్తారు. ప్రస్తుతం పీకేసీకి దాదాపు 2000 మంది వినియోగదారులున్నారు. 10కిపైగా స్పాలూ, ఏడు గృహ సముదాయాలతో పనిచేస్తున్నారు. నిర్మాణ సంస్థలు గృహ సముదాయాల్లో పీకేసీకి చోటిస్తున్నాయి. కొన్నయితే ప్లాంట్‌ని ఏర్పాటుచేసి దాని నిర్వహణను పీకేసీకి అప్పగిస్తున్నాయి. కొన్ని ఫైవ్‌స్టార్ హోటళ్లూ ఈ పద్ధతిని అనుసరిస్తున్నాయి. పీకేసీ నెలకు ఏడెనిమిది లక్షల రూపాయల వ్యాపారం చేస్తోంది. ఏడాదిలో దాన్ని రెండు మూడు రెట్లు చేయాలనేది వీరి లక్ష్యం. అంతవరకూ విశ్రమించేది లేదంటున్నారు పీకేసీ వ్యవస్థాపకులు. ★

# నా ప్రేమకథతో సినిమా తీస్తా!



**కథలు పుట్టినప్పట్నుంచీ, సినిమాలు తియ్యడం మొదలైనప్పట్నుంచీ... రచయితలు మారుండొచ్చు. కథలోని పాత్రల్లోనూ మార్పుండి ఉండొచ్చు. కానీ మనిషీ దెయ్యం చుట్టూ అల్లుకున్న ఏ కథలోనూ ఆత్మలు మనుషుల్ని భయపెట్టడం... అన్న కాన్సెప్టు మాత్రం మారలేదు. ఆ చరిత్రను తిరగరాసి, మనుషులకే దెయ్యాలు భయపడితే ఎలా ఉంటుందో చూపించి ప్రేక్షకుల మనసు గెలిచాడు మహీ వీ రాఘవ్. నిర్మాతగా అడుగు పెట్టి, దర్శకుడిగా మారి ఆనందో బ్రహ్మతో పెద్ద హిట్‌ని ఖాతాలో వేసుకున్న మహీ ప్రయాణం చిత్తూరు నుంచి బ్రిటన్, న్యూజిలాండ్ మీదుగా తెలుగు చిత్ర పరిశ్రమ వరకూ ఎలా సాగిందో ఆయన మాటల్లోనే...**

నేను దేవుడినీ దెయ్యాల్నీ నమ్మను. మరి, నాలాంటి ఏ నమ్మకం లేనివాడు ఒక దెయ్యం కథ చెబితే ఎలా ఉంటుందీ... అని నాకొచ్చిన ఆలోచనకు రూపమే 'ఆనందో బ్రహ్మ'. అసలు మనుషులు దెయ్యాల్ని చూసి ఎందుకు భయపడాలి..? శరీరం లేని ఆత్మకే అంత బలం ఉంటే ఆత్మా, శరీరం కలిసి ఉన్న మనిషికి ఇంకా బలం ఉండాలిగా అన్నదే నా లాజిక్. దేవుడైనా దెయ్యమైనా పుట్టుకొచ్చేది భయంలోంచే అనిపిస్తుంది నాకు. కానీ నేననుకున్నది ప్రేక్షకులు మెచ్చాలిగా... అందుకే, నా సినిమాలోని పాత్రలు ఏవిధంగానూ దెయ్యం గురించి భయపడే అవకాశం లేకుండా నలుగురికీ నాలుగు లోపాలను సృష్టించా. అదే రివర్స్‌లో దెయ్యం మనుషుల్ని చూసి భయపడేలా చేసింది. జనాన్ని కడుపుబ్బా నవ్వించింది.

### సినిమాలే చూడలా...

నేను సినిమాల్లోకి ఎలా వచ్చానంటే... అది నాకే అర్థం కాని కథ. మా ఊరు చిత్తూరు జిల్లాలోని బోరమంద గ్రామం. అమ్మ రమాదేవి, నాన్న వీర రాఘవ. నాకో తమ్ముడు. మాది మధ్యతరగతి కుటుంబం. నాన్న షుగర్ ఫ్యాక్టరీలో పనిచేసేవారు. ఆయనకు చదువంటే చాలా ఇష్టం. 'పిల్లలు ప్రయోజకులు కాకపోతే ఎంత ఆస్తి ఇచ్చినా కరిగిపోతుంది. చదువుని ఇస్తే అదే ఏం కావాలంటే అది సంపాదించి పెడుతుంది' అనేవారు. అందుకే, ఆయన ఆర్థిక పరిస్థితికి మించిన పనే అయినా నన్ను ఫస్ట్‌క్లాస్‌లోనే మదనపల్లె దగ్గరున్న హార్సిలీహిల్స్ బోర్డింగ్ స్కూల్లో చేర్పించారు. దాదాపు పన్నెండేళ్లు ఆ స్కూలే నా ప్రపంచం. ఎప్పుడో ఏడాదికి రెండుసార్లు సెలవులకి ఇంటికొచ్చేవాడిని. దాంతో పల్లెటూర్లో పుట్టినా మా ఊళ్లో నేను గడిపింది చాలా తక్కువ. అందుకే, మా ఊరికన్నా హార్సిలీహిల్స్‌తోనే నాకు అనుబంధం ఎక్కువ. స్కూల్ చదువైపోయాక బీకామ్ హైదరాబాద్‌లోనూ, ఎంబీఏ మద్రాస్ యూనివర్సిటీలోనూ చేశా. సినిమాల్లోకి వచ్చేవాళ్లకు చాలామందికి చిన్నప్పట్నుంచీ సినిమాలంటే విపరీతమైన ఇష్టం ఉండడం, కాలేజీలకు డుమ్మాకొట్టి మరీ సినిమాలకు వెళ్లడం లాంటి కథలుంటాయి. విచిత్రం ఏంటంటే... చిన్నపుడు నాకసలు ఆ అవకాశమే పెద్దగా రాలేదు. స్కూల్లో టీవీ కూడా పెట్టేవారు కాదు. డిగ్రీలోకొచ్చాకే సినిమాలు చూడ్డం అలవాటైంది. ఎంబీఏకి వచ్చేసరికి అది కాస్తా ఇష్టంగా మారిపోయింది. నాలో ఉన్న రచయిత కూడా బయటికి రావడం మొదలుపెట్టాడు. అప్పుడే ఆవైపు ప్రయత్నించాలనుకున్నా. కానీ నాన్న నన్ను అంత కష్టపడి చదివించారు. పదేళ్ల చదువుకి పదెకరాలు అమ్మడానిక్కూడా వెనకాడలా. నిజానికి చిత్తూరులో అన్ని కాలేజీలుంటే బీకామ్ చదవడానికి హైదరాబాద్ రావక్కర్లేదు. కానీ, బతకాలంటే చదువుతోపాటు చుట్టూ ఉన్న ప్రపంచం గురించి తెలుసుకోవడమూ అవసరం అనుకున్నారాయన. అందుకే, ఖర్చు చాలా అవుతుందని తెలిసినా డిగ్రీకి హైదరాబాద్ పంపించారు. నేనూ ఆయన నమ్మకాన్ని నిలబెట్టాలనుకునేవాడిని. బీకామ్ చదువుతూనే నాన్న ఇంటి దగ్గర్నుంచి డబ్బులు పంపిస్తున్నా, అనుభవం వస్తుందని అడ్వర్టైజింగ్‌లో క్లైంట్ సర్వీస్‌కి సంబంధించిన ఉద్యోగం చేసేవాడిని. సేల్స్‌మెన్‌గా కూడా కొంతకాలం పనిచేశా. అలాంటి నేను సినిమాలంటూ నాన్నను బాధపెట్టడం ఇష్టం లేక ఆ ఆలోచనను కొంతకాలం వాయిదా వేశా.

### లాభాల్లో ఉన్న కంపెనీని అమ్మేశా

ఎంబీఏ అయిపోయాక సికింద్రాబాద్‌లోని ఓ మల్టీమీడియా కంపెనీలో మార్కెటింగ్ ఉద్యోగం చేసేవాడిని. ఆరునెలలు పనిచేశాక కంపెనీ నష్టాల్లో ఉందనీ అమ్మేయాలనుకుంటున్నారనీ తెలిసింది. అక్కడ పనితీరు ఎలా ఉంటుందో, ఎక్కడ లోపాలున్నాయో నాకు తెలుసు. దాన్ని లాభాల్లోకి తీసుకురావచ్చు అనే నమ్మకం కలిగింది. నా స్కూల్ ఫ్రెండ్‌తో కలిసి ఆ కంపెనీని కొని లాభాల బాట పట్టించాం. ఆ ప్రయాణం రెండేళ్లపాటు సాగింది. కానీ మరీ 22 ఏళ్ల నుంచే విశ్రాంతి లేకుండా అయిపోవడంతో కొన్నాళ్లు కొత్తగా ఏదైనా చెయ్యాలనిపించింది. కంపెనీని అమ్మేసి ఎం.ఎస్. కోసం యూకే వెళ్లా. సరదాగా అక్కడ కొంత కాలం ఉండి, తర్వాత ఏదైనా ఉద్యోగంలో చేరాలన్నది నా ఐడియా. ఎం.ఎస్‌లో చేరాగానీ పూర్తిచెయ్యకుండానే అక్కడ ఉద్యోగంలో చేరిపోయా. మూడేళ్ల తర్వాత మకాం న్యూజిలాండ్‌కి మారింది. అక్కడ ఏడేళ్లు రిటైల్ మేనేజ్‌మెంట్ ఉద్యోగం చేసి బాగానే సంపాదించా. ఇక, సినిమాల్లో ప్రయత్నిద్దాం అనుకునేసరికి నేను న్యూజిలాండ్‌లో ఉన్నపుడే నాన్న చనిపోయారు. చాలా బాధపడ్డా. ఆయన ఉన్నంత వరకూ నా గురించి టెన్షన్ పడే సందర్భం రానీయలేదు. అదే నాకు తృప్తి.

సినిమాల్లోకి వచ్చేముందే సాధ్యమైనంత వరకూ చూద్దాం, నావల్ల కానపుడు తిరిగి న్యూజిలాండ్ వెళ్లిపోదాం అనుకున్నా. నేను నా ప్రయత్నాల్లో ఉండగానే ఓ స్నేహితుడు తెలిసినవాళ్ల 'వినాయకుడు' సినిమా తీస్తున్నారని చెప్పి వెళ్లి కలవమన్నాడు. నేను సహాయ దర్శకుడిగా అవకాశం కోసం ఆ సినిమా దర్శకుడు సాయికిరణ్‌ని కలిశా. నాకు మీరేం డబ్బులివ్వొద్దు. పని నేర్పించండి చాలు. బదులుగా నాకు మార్కెటింగ్

గురించి తెలుసు కాబట్టి, ఈ సినిమాకు మార్కెటింగ్ చేసి పెడతా అని చెప్పా. వినాయకుడు చిత్రానికి పనిచేసిన టీమ్‌తోనే తర్వాత నిర్మాతగా మారి 'విలేజ్‌లో వినాయకుడు' తీశా. అది నేను రాసిన కథే. సినిమాకు మంచి టాక్ వచ్చింది. కానీ మేం పెట్టిన డబ్బులు తిరిగిరాలేదు. 'కుదిరితే కప్పు కాఫీ' సినిమాకూ ప్రొడ్యూసర్‌గా ఉన్నా. ఆ సినిమా కూడా నష్టాల్నే మిగిల్చింది. తర్వాత 'పాఠశాల' సినిమాకు రచయితగానూ, దర్శకుడిగానూ మారా. నేను కూడా శేఖర్ కమ్ముల, తేజగారిలా కొత్తవాళ్లని తీసుకుని అద్భుతాలు చేసేద్దామనుకుని ఆ సినిమాకు అందర్నీ కొత్త నటీనటుల్ని తీసుకున్నా. కానీ అదంత సులభం కాదని తర్వాత అర్థమైంది. అందుకే, 'ఆనందోబ్రహ్మ'కు ఆ ప్రయోగం చెయ్యలేదు. ఈ సినిమాకి కథే హీరో అన్నది ఎంత నిజమో ఆ కథలో నటించినవాళ్లు సినిమా విజయానికి ప్రధాన కారణం అన్నది కూడా అంతే నిజం. సినిమా రాసుకుంటున్నపుడే రేచీకటి పాత్రను వెన్నెల కిషోర్ అయితే బాగా నిలపగలడు అనిపించింది. షకలక శంకర్‌ని జబర్దస్త్‌లో చూసి తన టాలెంట్‌కు చాలా ఆశ్చర్యపోయా. తను నటిస్తున్నప్పుడు ఆ మైకంలో ఉండిపోతాడు. మిగిలినవేవీ పట్టించుకోడు. ఇక, తాగుబోతు రమేష్ నిద్రలో కూడా ఆ పాత్రను బాగా చెయ్యగలడు. శ్రీనివాస్ రెడ్డి విషయానికొస్తే తన సీన్‌తో పాటు ముందు సీన్ వెనక సీన్ కూడా గుర్తుపెట్టుకుని, అర్థం చేసుకుని చెయ్యగలడు. 'ఆనందో బ్రహ్మ' సినిమాను ఏడాదిన్నర కిందటే అనుకున్నా. అప్పటికి తాప్సీ ఖాళీగానే ఉంది. అడగ్గానే ఈ సినిమాకి ఓకే చెప్పింది. కానీ నేను నిర్మాతను వెతుక్కునేసరికి ఆలస్యమైపోయింది. ఈలోపు తను హిందీలో 'పింక్' చిత్రం చెయ్యడమూ అది హిట్టవడమూ జరిగాయి. బాలీవుడ్‌లోనే మరో సినిమాకీ ఒప్పుకుంది. దాంతో నా సినిమా చేస్తుందో లేదో అనుకున్నా. కానీ రూపాయి తీసుకోకుండా ఈ సినిమా చేస్తానంది. సినిమా హిట్ అయితే లాభాల్లో కొంత ఇమ్మంది. మేకప్‌కీ విమాన టిక్కెట్లకు తప్ప మేం తనకేమీ ఇవ్వలేదు. అంతకు ముందు నేనెవరో తాప్సీకి తెలీదు. అయినా నా కథను అంత నమ్మింది. నిర్మాత విజయ్ చిల్లా కన్నా ముందు పదిమందికి ఈ కథ చెప్పా. కానీ విజయ్ అందులోని విషయాన్ని గుర్తించారు. నేనే నిర్మాతగా ఉన్నప్పటి కన్నా ఇది నాకు ఎక్కువ సంతృప్తినిచ్చింది. మనం కథ రాసుకుని మనమే బాగుందనుకుని డబ్బులు పెట్టుకోవడం గొప్పకాదు. వేరేవాళ్లు మన కథను నమ్మి చెయ్యడమే గొప్ప.



## తెలుగు రాయడం రాదు...

పుట్టింది చిత్తూరులోనే అయినా చిన్నప్పట్నుంచీ ఇంగ్లిష్ మీడియం స్కూల్ కావడం విదేశాల్లో ఉండడంతో తెలుగులో నా పేరు తప్ప నాకు ఇంకేం రాయడం రాదు. కానీ గూగుల్ ట్రాన్స్‌లేటర్ పుణ్యమా అని కథల్నీ డైలాగుల్నీ కూడా తెలుగులో రాసేస్తున్నా. సినిమాల్లోకి వచ్చాక ఏడు కోట్ల రూపాయలు పోగొట్టుకున్నా. అది నా ఎన్నో ఏళ్ల కష్టార్జితం. నాకు దేవుడు అదృష్టం ఇచ్చి బతకరా... అన్నాడు. కానీ నేనే ఇలా సవాళ్లు కావాలనుకున్నా. అందులో ఎవరి తప్పూ లేదు. జీవితంలో ఎవరికోసం వాళ్లు బతకాలనే స్వార్థం కొంచెమైనా ఉండాలన్నది నా అభిప్రాయం. మన ఇష్టాయిష్టాలకోసం మనమే బతకలేకపోతే ఎలా... నాన్నకోసమని ఓసారీ, కుటుంబం కోసమని ఇంకోసారీ సంపాదించినదంతా పోతే ఏం చెయ్యాలని మరోసారీ వయసైపోయిందనీ... ఇలా భయపడుతూ పోతే ఎప్పటికీ అనుకున్నది సాధించలేం. ఓటమి ఎదురైన ప్రతిసారీ దగ్గరివాళ్లు చాలామంది 'ఇంకొద్దురా నాయనా వెళ్లిపో' అన్నారు. పాఠశాల తీశాక 'డైరెక్టర్‌గానూ ముచ్చట తీరిపోయిందిగా ఇక చాల్లే' అని చెప్పారు. కానీ నా ఇష్టం నాది. దాని వల్ల పడే కష్టం కూడా నాదే. ఈ సినిమా విడుదలయ్యే ముందు కూడా నేనొక్కటే అన్నా... పట్టుదలకూ మూర్ఖత్వానికీ చిన్న గీతే తేడా అని. రేపు సినిమా ఆడితే పట్టుదల అంటారు. పోతే మూర్ఖత్వం అని తిడతారు. అందుకే, జనం ఏం అంటారన్న దానికన్నా మనకేం కావాలో అదే చెయ్యాలనే క్లారిటీ ఉంది నాకు. అయినా నాకు సినిమా అంటే ఎంత ఇష్టం లేకపోతే చక్కగా డబ్బులొచ్చే ఉద్యోగాన్ని వదిలేసి పదేళ్లపాటు ఓటమిని లెక్కచెయ్యకుండా ఎదురుచూస్తాను... ఓడిపోయిన ప్రతిసారీ దాన్నుంచి నేను చాలా నేర్చుకున్నా. పాఠశాల సినిమాలో కామెడీనే లేదన్నారు. అది తెలిసింది కాబట్టే ఆనందో బ్రహ్మలో అంతగా నవ్వించగలిగా.



నా కథలన్నీ వేరు వేరు ప్రదేశాలకు తిరుగుతున్నపుడు నా అనుభవాల్నుంచే పుట్టుకొస్తాయి. నాకు పుస్తకాలు చదివే అలవాటు కూడా పెద్దగా లేదు మరి. అసలు స్కూల్లోనే నా చదువు అంతంత మాత్రం. ఫస్ట్‌క్లాస్ రెండేళ్లు చదివా. దానికి తోడు నాన్న నిదానంగా చదవరా తొందరేముందీ... అనేవారు. ఆ తర్వాత కూడా మా క్లాస్‌లో 28 మంది ఉంటే నాకు 25, 26 ర్యాంకులు వచ్చేవి. నాన్నకు చెప్తే 'నీకన్నా ఇంకా ముగ్గురు వెనకున్నారా... ఎవర్రా వాళ్లు' అనేవారు. కానీ ఎప్పుడూ చదవమని ఫోర్స్ చెయ్యలా. చదువంటే మార్కులు కాదు జ్ఞానం అన్నది ఆయన నమ్మకం. నేనూ అదే నమ్ముతా.

## అది నా ప్రేమకథ!

కాలేజీలో చదివేటపుడు లవ్ స్టోరీలు ఉన్నాయి. కానీ వాటి గురించి ఇప్పుడు చెప్పను ఎందుకంటే దానిమీద ఓ సినిమా తియ్యాలనుకుంటున్నా. అందులో నా కథతో పాటు నా చుట్టూ జరిగిన ప్రేమకథలూ ఉంటాయి. నా ప్రేమ సక్సెస్ కాలేదు. కానీ అది ఏ మలుపు తిరిగితే బాగుంటుందని నాకనిపిస్తే సినిమాను అలా తీస్తా. చాలా మంది ప్రేమలో విఫలమైతే అన్నీ కోల్పోయినట్లే అనుకుంటారు. ఆ సందర్భానికి అలా అనిపిస్తుంది కానీ ఓ పదేళ్ల తర్వాత మనం అప్పుడు అలా ఉన్నామా అని తలుచుకుని మనమే నవ్వుకుంటాం. ఏ బాధైనా కష్టమైనా కాలంతో పాటు మాయని గాయం ఉండదుగా. కాబట్టే పెద్దలు కుదిర్చిన పెళ్లి చేసుకున్నా నేనిప్పుడు సంతోషంగా ఉన్నా. నాకిద్దరు పిల్లలు. ప్రస్తుతం హైదరాబాద్‌లోనే ఉంటున్నాం. నా అనుభవం దృష్ట్యా 21ఏళ్ల తర్వాత పిల్లల్ని కొంత కాలం విదేశాలకు పంపడం మంచిదే. పాశ్చాత్య దేశాల్లో నేను నేర్చుకున్న ఓ మంచి విషయం ఏంటంటే... అక్కడ చేసే ఉద్యోగాన్ని బట్టి మనుషుల్ని గౌరవించడం అనేది ఉండదు. డాక్టర్‌కైనా సెలూన్‌లో పనిచేసే వ్యక్తికైనా ఒకలాంటి మర్యాదనే ఇస్తారు. ఆ ఇద్దరిలో ఎవరు లేకపోయినా మనకు జరగనప్పుడు ఇద్దరి పనీ గొప్పదేగా. అందుకే, ఇంటిపేరుతోనో కులంతోనో కాకుండా నన్ను నాలానే గుర్తించాలన్న ఆలోచనతోనే పేరుని కూడా మార్చేసుకున్నా. నా అసలు పేరు మహేంద్ర. దాన్ని మహీ చేసి నాన్న పేరు వీర రాఘవని వీ రాఘవ్ గా కలిపి పెట్టుకున్నా.

– యార్లగడ్డ మధులత

కల్తీలేని పాలను తాగాలంటే..?
పాడి రైతు జీవితాల్లో వెలుగు నింపాలంటే..?
పాడి పశువులు ఆరోగ్యంగా ఉండాలంటే..?
ఈ ప్రశ్నలకు ఓ రైతుబిడ్డ సమాధానమే
'రియల్‌మిల్క్'!



# ఇవి... కల్తీ లేని పాలు!

ప్రకాశం జిల్లా అడవిపాలేనికి చెందిన శ్రీనివాస్ సాఫ్ట్‌వేర్ నిపుణుడిగా పనిచేశాడు. రైతు కుటుంబానికి చెందిన అతడు వ్యవసాయమూ చేస్తుండేవాడు. వాళ్లకు పాడి కూడా ఉండేది. ఉద్యోగంలో చేరాక ఊళ్లో పెద్ద డెయిరీ ఫామ్‌ను ఏర్పాటు చేశాడు. అతడి తమ్ముడు దీన్ని చూసుకునేవాడు. ఫాం నిర్వహణ కోసం ఏటా లక్షల్లో ఖర్చు చేస్తుండేవాళ్లు. కానీ ఎప్పుడూ లాభాలు వచ్చింది లేదు. 'రైతులందరిదీ ఇదే పరిస్థితా...' అన్న సందేహం వచ్చింది శ్రీనివాస్‌కి. దీంతో మూడేళ్ల కిందట సొంతూరికి తిరిగొచ్చి వెయ్యి మందికి పైగా రైతులను కలిశాడు. 90శాతం రైతులది ఇదే పరిస్థితి అని తెలుసుకొని దీనికో పరిష్కారం చూపాలనుకున్నాడు.

**సమస్యను గుర్తించి..**

పశువుల ఖరీదు, మేత, కూలీలు, అనారోగ్య సమస్యలు... ఇవన్నీ బేరీజు వేసుకుంటే లీటరు ఆవు పాల ఉత్పత్తికి రైతుకు సగటున రూ.30, గేదె పాలకు రూ.45 వరకూ అవుతోంది. కానీ డెయిరీల నుంచి రైతుకు ఆవు పాలకు రూ.22, గేదె పాలకు రూ.35-40 వస్తోంది. అంటే లీటరుపైన రూ.5-10 వరకూ నష్టమే ఉంటోంది. రైతుకు మంచి ధరను చెల్లిస్తూనే ఒక గేదెనూ, ఆవునూ ఇంటిలో పెంచుకుంటే ఎంత నాణ్యమైన పాలను తాగుతారో, అంతకు మించిన నాణ్యతతో పాలను వినియోగదారులకు అందివ్వాలనుకున్నాడు శ్రీనివాస్. దీనికోసం ఓ ప్రణాళిక సిద్ధం చేశాడు. అవసరమైతే ప్రారంభంలో నష్టాల్ని భరించడానికి సిద్ధమయ్యాడు. 'తాము ఉత్పత్తిచేసే పాలు ఎంతకు కొనుగోలు చేస్తున్నారనేది రైతుకు తెలియాలి. అలాగే వినియోగదారులకూ రైతు వివరాలు అందించాలి అప్పుడే పారదర్శకంగా ఉంటుంద'ని భావించాడు. దీనికోసం 'రియల్ మిల్క్' పేరుతో ఓ వెబ్‌సైట్‌నూ, యాప్‌నీ అభివృద్ధి చేయించాడు. రైతులు రియల్ మిల్క్‌లో నమోదు కావాలంటే పశువులకు కలుషితం కాని నీరూ, నాణ్యమైన మేత, ఉండేందుకు మంచి వాతావరణం ఏర్పాటు చేయాలి. ఏ మందులు పడితే అవి వాడకూడదు. వీటిపైన రియల్‌మిల్క్ సిబ్బంది రైతులకు వారంపాటు శిక్షణ ఇచ్చి, మరో 15 రోజులు దగ్గరుండి పర్యవేక్షిస్తారు. మంచి మేతను కొని వేయడం ఖర్చుతో కూడినది, పాల ధర మాత్రం అంత లేదు. అయితే, ఆరోగ్యంగా ఉన్న పశువులు 13 నెలలకు ఒకసారి కచ్చితంగా ఈతకు వస్తాయి, వాటి పాల దిగుబడి ఎక్కువ కాలం ఉంటుంది... వీటిపైనా రైతులకు అవగాహన కల్పించారు. సభ్యత్వం తీసుకున్న రైతుకు డెయిరీలు ఇచ్చే ధరకు రెట్టింపు ధర అందిస్తున్నారు. ఆవు పాలకు రియల్‌మిల్క్‌లో రూ.50 ఇస్తున్నారు. గేదెపాలకు రూ.60 ఇస్తున్నారు. గృహావసరాలకే కాకుండా హోటళ్లు, ఆసుపత్రులూ, స్కూళ్లు, బేకరీలూ... ఇలా, పాలు అవసరమైనవాళ్లు ఎవరైనా వెబ్‌సైట్ (realmilk.co.in)లో రిజిస్ట్రేషన్ చేసుకోవచ్చు. లేదంటే యాప్‌ను డౌన్‌లోడ్ చేసుకుంటే చాలు. బయట మార్కెట్‌లో వెన్న తీయని పాలకు ఎంత ధర ఉందో రియల్ మిల్క్‌నీ అంతే ధరకు అందిస్తారు. సంస్థ నిర్వహణకు వినియోగదారుల నుంచి లీటరు గేదెపాలకు రూ.2 సర్వీసు ఛార్జిగా తీసుకుంటారు. రైతులు రియల్ మిల్క్ నుంచి పొందే శిక్షణ, పశు వైద్య సదుపాయం, తదితర సేవలకుగానూ తమకు వచ్చే రూ.60లో నాలుగు రూపాయలు ఆ సంస్థకు చెల్లిస్తారు. వీటితోనే ప్రస్తుతం సంస్థ నిర్వహణ చేపడుతున్నారు. ఒక్కో లీటర్‌కు రూ.7-8 నిర్వహణ ఖర్చవుతోంది. సంస్థకు వచ్చేది లీటరుపైన ఆరు రూపాయలు మాత్రమే. రైతులు మరో రూపాయి తీసుకోమంటున్నా, 'మేం వ్యాపారం కోసం రాలేదు. ఓ వ్యవస్థను సృష్టించాలనే సంకల్పంతో వచ్చాం. ఈ విషయంలో రాజీపడితే లక్ష్యం మరచిపోయినట్టే' అంటారు శ్రీనివాస్.

**ఆరు వేల లీటర్లు...**

రైతు నుంచి ఆవు, నాటు ఆవు, గేదె పాలను వేర్వేరు క్యాన్లలో సేకరిస్తారు. డెలివరీ చేయాల్సిన దూరం పది కిలోమీటర్లు దాటకుండా ఉండేలా చూస్తారు. ఒకవేళ వినియోగదారుడు పాలకు ఆర్డర్ ఇచ్చినా ఆ దగ్గర్లో రియల్‌మిల్క్ రైతు ఉంటేనే అందజేస్తారు. పాలను రైతునుంచి సేకరించిన మూడు గంటల్లోగా కొనుగోలుదారునికి అందిస్తారు. పాలు వచ్చిన అరగంటలోపే కాచి ఉంచుకోమని చెబుతారు. నాటు ఆవు పాలలో ఉండే పోషకాల దృష్ట్యా వాటికి మంచి డిమాండ్ ఉంది. అందుకే రియల్ మిల్క్ వాటిని లీటరు రూ.80కి అందిస్తోంది. డెయిరీలు రైతులకు నాటు ఆవుపాలకూ రూ.22 ఇస్తుండగా రియల్ మిల్క్ రూ.60 ఇస్తోంది. ధర అధికంగా రావడంతో రైతులూ దేశీ జాతిపై ఆసక్తి చూపిస్తున్నారు. ఈ పాలు తక్కువగా దొరకడం వల్ల సేకరణ చాలా ఖర్చుతో కూడుకున్నదనీ, వీటి ఉత్పత్తి పెరిగితే రైతుకే పూర్తి మొత్తం అందిస్తామనీ చెబుతారు శ్రీనివాస్. ప్రస్తుతం రియల్‌మిల్క్ కృష్ణా, ప్రకాశం జిల్లాల్లో మాత్రమే పని చేస్తోంది. ఇక్కడ ఆరు వేల లీటర్ల పాలను నిత్యం సరఫరా చేస్తున్నారు. ప్రస్తుతం 400మంది నమోదిత రైతులున్నారు. భవిష్యత్తులో దక్షిణ భారతదేశమంతటికీ విస్తరించి 'గొడ్డుకు పెట్టిందీ, భూమికి పెట్టిందీ ఎక్కడికీ పోదనే తన నమ్మకాన్ని... నిజం చేసి చూపిస్తానంటున్నాడు శ్రీనివాస్!

– మరిశర్ల జగదీష్, ఈనాడు అమరావతి
ఫొటోలు: మరిడయ్య



క్రీడాకారులకు ఆట ఎంత ముఖ్యమో ఫిట్‌నెస్ కూడా అంతే! మన క్రికెట్ జట్టు శ్రీలంక తాజా పర్యటన విజయవంతమవడంలో ఆటగాళ్ల ఫిట్‌నెస్ కూడా ఒక కారణం. కొందరు టీమ్ ఇండియా ఆటగాళ్లు ఆహారం, వ్యాయామాల విషయంలో ఎలాంటి నియమాలు పాటిస్తారో తెలుసా!



# ఆటకు సిద్ధమవుతున్నారిలా!

## బ్యాడ్మింటన్ ఆడుతూ

'లైఫ్‌ని ఎంజాయ్ చేయడం ముఖ్యమే కానీ, అందరూ తినే పదార్థాల్ని క్రీడాకారులు తినకూడదు' అని చెప్పే ఎం.ఎస్.ధోనీ, బ్రేక్‌ఫాస్ట్‌గా పిండి పదార్థాలతో చేసే పారిడ్జ్‌లో పండ్లూ, నట్స్ వేసుకొని తింటాడు. తర్వాత ఓ గ్లాసు పాలు తాగుతాడు. లంచ్, డిన్నర్ మాత్రం రోటీల్ని పప్పు, చికెన్ కర్రీతో తింటాడు. లంచ్ సమయంలో యోగర్ట్ తీసుకుంటాడు. మధ్యలో ఎప్పుడైనా చికెన్ శాండ్‌విచ్, వెజ్ సలాడ్ తింటాడు. మ్యాచ్ రోజున ప్రొటీన్ డ్రింకులూ, తాజా పండ్ల రసాలూ తాగుతాడు. ధోనీ జిమ్‌లో కష్టపడటానికి ఎక్కువగా ఇష్టపడడు. పర్యటనల మధ్య ఖాళీ దొరికితే బ్యాడ్మింటన్ ఆడతాడు. దాంతో చురుగ్గా కదలగలగడంతోపాటు చూపు కూడా మెరుగవుతుం దంటాడు. అలాగే ఫుట్‌బాల్ ఆడటమన్నా ఇష్టమే. వికెట్ కీపర్‌గా ధోనీ మైదానంలోనే శారీరకంగా చాలా కష్టపడాల్సి వస్తుంది. అయినా కూడా మజిల్ పవర్ పెంచుకోవడానికి మ్యాచ్‌లు జరిగేటపుడు బరువులెత్తే వ్యాయామాలు చేస్తాడు.



## ఎండు ఫలాలే బలం!

టీమ్ ఇండియాలో ఫిట్‌నెస్ అంటే కెప్టెన్ విరాట్ కోహ్లీదే అంటున్నా రంతా. ఒకప్పుడు బటర్ చికెన్, మటన్ రోల్స్‌ని ఇష్టంగా తినేవాడు కోహ్లీ. కానీ ఇపుడు వాటికి చాలా దూరం. బ్రేక్‌ఫాస్ట్‌కి ల్యాంబ్ చాప్స్, సాల్మన్ ఫిష్ తింటాడు. లంచ్, డిన్నర్‌లలో కార్బోహైడ్రేట్స్ ఎక్కువగా ఉండే పాస్తా, ఓట్‌మీల్, స్పాగెట్టీ, ఆలూ, స్వీట్ కార్న్, రాజ్మా, అలాగే ప్రొటీన్స్ ఎక్కువగా ఉండే ఫిష్, ఎగ్ వైట్, చికెన్ సోయాబీన్స్, పప్పులూ తింటాడు. వీటితోపాటు డ్రైఫ్రూట్స్, నట్స్ ఎక్కువగా తీసుకుంటాడు. వ్యాయామానికీ తగినంత ప్రాధాన్య మిస్తూ ఉదయం ఆరింటికే జిమ్‌లో ఉంటాడు. స్టామినా పెంచుకోడానికి కార్డియో, మజిల్ పవర్ పెంచుకోవ డానికి బరువులెత్తడం చేస్తాడు. రోజూ రెండు గంటలూ, వారంలో అయిదు రోజులూ తప్పనిసరిగా జిమ్ చేస్తాడు. ఫిట్‌నెస్‌తో మానసికంగానూ బలంగా తయారయ్యానంటాడు.

## పదింటికే నిద్ర

నిద్ర, ఆహారం, వ్యాయామాల్లో క్రమశిక్షణతో ఉండటంవల్ల తన ఆట పూర్తిగా మారిపోయిందం టాడు ఆల్‌రౌండర్ హార్దిక్ పాండ్య. బ్రేక్‌ఫాస్ట్‌లోనూ లంచ్‌లోనూ ప్రొటీన్స్, కార్బోహైడ్రేట్స్, ఫైబర్ ఉండేట్టు చూసుకుంటాడు పాండ్య. రాత్రిళ్లు అన్నం, చపాతీలూ తినకుండా చికెన్ ఐటమ్ లేదా ప్రొటీన్ సప్లి మెంట్ తీసుకుంటాడు. పదింటికి నిద్రపోయి వేకువనే లేచి ఉత్సాహంగా వర్కవుట్ ప్రారంభిస్తాడు. మ్యాచ్‌లు లేనపుడు కూడా కొన్ని సార్లు రోజంతా వ్యాయా మానికే కేటాయిస్తాడు.



## యోగా చేయాల్సిందే!

వారంలో అయిదు రోజులు జిమ్ కచ్చితంగా చేస్తాడు శిఖర్ ధావన్. మూడు రోజులు వెయిట్ ట్రైనింగ్‌కీ, రెండ్రోజులు కార్డియో సెషన్స్‌కీ కేటాయిస్తాడు. వీటితోపాటు స్విమ్మింగ్, రన్నింగ్, యోగా తప్పని సరి. మ్యాచ్‌లు లేని రోజున విశ్రాంతి కోసం పగటిపూట ఒక గంట నిద్రపోతాడు. ఆహారం విషయానికొస్తే విటమిన్లు బాగా ఉండే శాకాహారం తీసుకుంటాడు. ముఖ్యంగా ఉడక బెట్టిన కాయగూరలు తింటాడు. తందూరీ చికెన్, ఫిష్, బ్రకోలీ తరచూ తింటాడు. ధావన్‌కి ఆలూ పరాటాలూ, చికెన్ కర్రీ, దోశ, మటన్ రోగన్‌జోష్ అంటే ఇష్టం. అవి తిన్నరోజున జిమ్‌లో ఇంకా ఎక్కువ శ్రమిస్తాడు.



## ఆమ్లెట్ తప్పనిసరి!



గుడ్లతో చేసిన వంటకాల్ని ఎక్కువగా తీసుకుంటాడు రోహిత్ శర్మ. వాటిలోనూ ఆమ్లెట్ అంటే ఇష్టం. శరీరానికి కావల్సిన ప్రొటీన్ ఎగ్స్ ద్వారానే తీసుకుంటాడు. న్యూట్రిషనిస్టు సలహాతో కార్బోహైడ్రేట్స్ పూర్తిగా తగ్గించేశాడు. నిద్రకు కూడా బాగా ప్రాధాన్యమిస్తాడు. ప్రొటీన్లు ఎక్కువగా ఉండే ఓట్సూ, పాలూ బ్రేక్‌ఫాస్ట్‌గా తీసుకుంటాడు. ఇంకా ప్రొటీన్ డ్రింక్స్ తాగుతాడు. కొన్నాళ్ల కిందటి వరకూ బరువు తగ్గించుకోవడానికి కష్టపడిన రోహిత్, రాత్రి ఎనిమిదిలోపే డిన్నర్ చేసే అలవాటుతో బరువుని నియంత్రణకు తెచ్చుకోగలి గాడు. క్రమం తప్పకుండా వ్యాయామాలూ, యోగా చేస్తాడు. ఆయిల్ ఫుడ్‌కి పూర్తిగా దూరం.



# రాగి వర్ణం...

## సరికొత్త ఫ్యాషన్ రాగం

**'చూడగానే ఎదుటివాళ్లను ప్రేమలో పడేసే రొమాంటిక్ కలరేమిటా' అని శోధించిన వర్ణ నిపుణులకి అంతిమంగా దొరికిన సమాధానమే కాపర్. అందుకే ఇప్పటికే ఎంతో ప్రాచుర్యం పొందిన బంగారమూ వెండి వంటి తోటి మెటాలిక్ రంగుల్నీ, నీలమూ పచ్చల్లాంటి రత్నాల సౌందర్యాన్నీ, నారింజా ఎరుపూ వర్ణాలతో నిండిన హరివిల్లు అందాల్నీ, గులాబీ వంగ వంటి పూలరంగుల్నీ పక్కకు నెట్టేసి తెరమీదకొచ్చింది తాజా ఫ్యాషన్ కలర్ తామ్రం ఉరఫ్ కాపర్ ఉరఫ్ రాగి. ఆ రాగి సోయగాలమీద ఓ లుక్కేస్తే...**

ప్రకృతిలో విరిసిన పువ్వులే రంగుల పుట్టిల్లు అని కవివర్యులూ, కాదు హరివిల్లే అనీ కాంతి నిపుణులూ, లేదు లేదు...నేలమాళిగే రంగులనిధి అని ఖనిజ పరిశోధకులూ...ఇలా ఎవరికి వాళ్లు రంగుల పుట్టుపూర్వోత్తరాల గురించి భాష్యాలు చెబుతుంటారు. మొత్తమ్మీద సృష్టిలోని రంగులన్నీ పువ్వులనుంచో హరివిల్లునుంచో ఖనిజాలనుంచో పుట్టినవే. ఆ పేర్లతో ప్రసిద్ధి చెందినవే. అయితే, వీటన్నింటిలోకెల్లా అందమైన రంగేదీ అంటే, 'నాకు నచ్చిన రంగే' అని ఎవరికి వాళ్లు చెప్పుకోవచ్చుగాక. కానీ ప్రపంచ వర్ణశాస్త్రనిపుణులు మాత్రం కాలానుగుణంగా మారుతోన్న వ్యక్తుల మనస్తత్వాల్నీ జీవనశైలినీ అంచనావేస్తూ ఎప్పటికప్పుడు ఫ్యాషన్ ప్రపంచంలోనూ సౌందర్యోత్పత్తుల తయారీలోనూ గృహాలంకరణలోనూ ఉపయోగించేందుకు ప్రత్యేకంగా కొన్ని రంగుల్ని ఎంపికచేస్తుంటారు. అలా గ్లోబల్ కలర్ రిసెర్చ్‌కు చెందిన నిపుణులు ఇటీవల ఎంపికచేసిన రంగుల్లో కాపర్ ఒకటి. దాంతో ఇప్పుడిది ప్రపంచవ్యాప్తంగా ఫ్యాషన్ ప్రియుల్ని కట్టిపడేస్తోంది.

గోధుమరంగుతో కూడిన నారింజఎరుపునే రాగిరంగుగా కొందరు వర్ణిస్తే, పింకీ రెడ్ లేదా పింకీ ఆరెంజే తామ్ర వర్ణమని మరికొందరు అభివర్ణిస్తారు. ఎరుపురంగుకి చెల్లోఅక్కో అంటూ చుట్టరికాన్నీ కలిపేస్తారు ఇంకొందరు. మొత్తమ్మీద ఇదీ అని చెప్పలేని ఒకలాంటి మెరుపుతో కూడిన ఎరుపే కాపర్. రాగికి ఉన్న మరో పేరే ఆరమ్ రబ్రమ్...లాటిన్ భాషలో రెడ్‌గోల్డ్ అని అర్థం. ఎర్రబంగారంగా పేరొందిన ఆ రాగి వాడకం ఇటీవల అంతటా పెరిగిందన్నది తెలిసిందే.

### కాపర్ ఫ్యాషన్!

ఖనిజంగా దాని వాడకం సంగతి పక్కనబెడితే, డిజైనర్లంతా ఆ రంగుమీద కొత్తగా మమకారాన్ని పెంచుకోవడంతో అంతర్జాతీయ ఫ్యాషన్ వేదికలమీద కాపర్ కలర్ హల్‌చల్ చేస్తోంది. గోధుమా తెలుపూ పసుపూ... ఇలా కాపర్‌తో మ్యాచయ్యే రంగులు చాలానే ఉన్నప్పటికీ నీలిపచ్చ దీనికి చూడచక్కని జోడీ అంటూ రకరకాల కాపర్ సమ్మేళనాల్నీ సృష్టించేస్తున్నారు నయా ఫ్యాషనిస్టులు. కేవలం డ్రస్సులూ యాక్సెసరీల రూపకల్పనలతో ఫ్యాషన్ లోకమే కాదు, కాస్మొటిక్ ప్రపంచం సైతం రాగి రంగు సౌందర్యంమీద మనసు పారేసుకుంది. ఫలితం... లిప్‌స్టిక్కులూ నెయిల్‌పాలిషులూ ఫేసుపౌడర్లూ ఐమేకప్పుల్లో కూడా కాపర్ హవా నడుస్తోంది. పైగా రాగివర్ణం శృంగార ప్రేరితమనీ, కోరికనీ ప్రేమనీ సూచిస్తుందనీ కలర్‌థెరపిస్టులు నొక్కి మరీ చెప్పడంతో దీనిమీద మోజు మరింత పెరిగిందనే చెప్పాలి. పాశ్చాత్యదేశాల్లో అమ్మాయిల హాటెస్ట్ హెయిర్ కలరూ కాపరేనట. దాంతో బాలీవుడ్ భామల జుట్టుకీ ఆ రంగు అతుక్కుంటోంది.

### ప్రకృతి సోయగం!

శీతకాలపు గృహాలంకరణలోనూ కాపర్ రంగుదే హవా. నులివెచ్చని భానూదయం, చల్లచల్లని సూర్యాస్తమయ వేళల్లో ఆకాశంలో కనువిందుచేసే నారింజఎరుపు సౌందర్యాన్నీ, లేలేత రాగి రంగు సొగసుల్ని అద్దుకున్న చిగురుటాకుల్నీ తలపించేలా కాపర్ వర్ణం పడకింటిలో ఉన్నా హాల్లో ఉన్నా మనసును మధురోహల్లో ముంచెత్తుతుందట. రకరకాల థీమ్ వెడ్డింగుల్లోనూ కాపర్ వర్ణానికి ఆదరణ పెరుగుతోంది. వేడుకకు ఆహ్వానం పలికే కార్డుల నుంచి కేకుల వరకూ అన్నీ ఆ రంగుల్లోనే మెరుస్తూ అతిథుల్ని ఆకర్షిస్తున్నాయి. ఇక, సంపన్నుల విందుభోజనాల్లో గ్లాసుల నుంచి గిన్నెల వరకూ అన్నింటా రాగి ఆతిథ్యమే కనువిందు చేస్తోంది. ఒకప్పుడు ఇంట్లో ఓ మూల కిటికీలో రాగిచెంబు కనిపిస్తేనే ముఖం చిట్లించుకునే యువత నేడు, అదే రాగి వస్తువులతో భోజనాల బల్లల్ని నింపేయడం విశేషం. వంట పాత్రల్లో రాగి వాడకంవల్ల, ఆ ఖనిజం ఒంట్లోకి చేరడంతోబాటు, అనేక సూక్ష్మజీవుల్ని నాశనం చేస్తుందన్న శాస్త్రీయ పరిశోధనల కారణంగానే రాగి పూర్వవైభవాన్ని దక్కించుకుందని చెప్పొచ్చు.

వస్తువుల రూపంలోనే కాదు, రెడ్‌గోల్డ్ అన్న పదాన్ని నిజం చేస్తూ ఆభరణాల రూపంలోనూ రాగి వాడకం పెరుగుతోంది. గతంలో కేవలం గిరిజన తెగలకు మాత్రమే పరిమితమైన రాగి నగల సోకులు, ఇప్పుడు ఆధునికుల్నీ అలరిస్తున్నాయి. అందమైన నెక్లెసులూ చెవిపోగులూ బ్రేస్‌లెట్లూ ఉంగరాలూ... ఇలా అన్నింటా తామ్రం మెరుస్తూ నేటి తరాన్ని మురిపిస్తోంది. ఆరోగ్యాన్ని పంచిస్తుందన్న కారణంతోనూ వీటిని ధరించేవాళ్ల సంఖ్య రోజురోజుకీ పెరుగుతోంది. మనమూ ఆ రాగి రంగుని ఆనందంగా స్వాగతించేద్దామా..! ★
















# హడలెత్తించే రెస్టరెంట్ ఇది!









**దెయ్యం... ఎప్పటికీ ఎవ్వరికీ బోరుకొట్టని టాపిక్. భయపెడుతుంది. చెవులు రిక్కించుకుని వినేలా, కళ్లప్పగించి చూసేలా చేస్తుంది. రెప్పపడకుండా ఏకబిగిన చదివించేస్తుంది. అందుకే సినిమాల్లోనూ కథల్లోనూ నవలల్లోనూ దెయ్యాలుంటే చాలు, హిట్లే హిట్లు. జనంలోని ఆ క్రేజ్‌ని గ్రహించే ఇప్పుడు ప్రపంచవ్యాప్తంగా హారర్‌థీమ్‌తోనూ రెస్టరెంట్లు వెలుస్తున్నాయి. చెన్నైలోని ఈ హాంటెడ్ రెస్టరెంట్ కూడా ఆ కోవకు చెందినదే.**



'చెట్టుమీద దెయ్యం.. నాకేం భయం...' అనుకుంటూనే ఊరి చివర ఉన్న మర్రిచెట్టు దగ్గరకు వెళ్లి కాసేపు అక్కడ గడిపి, 'నేను దెయ్యాలను చూశాను. అయినా భయపడ లేదు తెలుసా...' అంటూ స్నేహితుల ముందు కాలరెగరేసే బాలవీరులు అక్కడక్కడా కనిపిస్తూనే ఉంటారు. పిల్లలే కాదు, యువతరానికీ పెద్దవాళ్లకీ అందరికీ దెయ్యాలంటే ఆసక్తే. ఉన్నాయో లేవో తెలీని ఆ దెయ్యాల గురించి తమదైన ఊహలు జోడించి మనిషి తీసే సినిమాలూ నవలలకి అత్యంత ఆదరణ లభించడానికి అదే కారణం.






ఆ విషయాన్ని గుర్తించే అమెరికా, జపాన్‌లలో ఇప్పటికే అదే థీమ్‌తో రెస్టరెంట్లను సైతం నిర్మిస్తూ వినియోగదార్లను ఆకర్షిస్తున్నారు. వాల్ట్ డిస్నీ సైతం తన మ్యాజిక్ కింగ్‌డమ్‌లో ద హాంటెడ్ మాన్షన్ థీమ్డ్ రెస్టరెంట్‌ను ప్రారంభించబోతుందట. దెయ్యమనే భయానక అనుభూతిని మనం మాత్రం ఎందుకు మిస్సవ్వాలి అనుకున్నారేమో మనదేశంలోనూ తొలి హాంటెడ్ రెస్టరెంట్‌ను నిర్వహించేస్తున్నారు చెన్నైవాసులు. అన్నానగర్‌లో ఉన్న ఆ రెస్టరెంట్‌లోకి వెళితే... ప్రవేశద్వారం దగ్గరే ఓ దెయ్యం చెయ్యి నేలలోంచి పొడుచుకు వచ్చినట్లుగా లేచి ఉంటుంది. అది దాటి లోపలకు వెళ్లగానే ఓ పక్కగా ద్వారం దగ్గరున్న పిశాచి మన మీదకి దూకుతున్నట్లే అనిపిస్తుంది. లోపల కూడా మంచి వెలుతురు లేకుండా మరీ చీకటి కాకుండా మిణుకుమిణుకుమనే వెలుతురు ఉంటుంది. చీకటివెలుగులు దోబూచులాడుతున్నట్లున్న ఆ వాతావరణంలోకి భయంభయంగా అడుగు పెట్టి, సీటు చూసుకుని కూర్చోగానే గోడల మీద మెరుస్తున్నట్లుగా కపాల బొమ్మలు దర్శనమిస్తాయి. కాస్త పిరికివాళ్లయితే వాటిని చూడగానే కెవ్వుమనడం ఖాయం. అందులోనూ భయస్తులు అర్ధరాత్రి కొవ్వొత్తుల వెలుగులో అక్కడ తినడానికి ప్రయత్నిస్తే గుండె ఓ నిమిషంపాటు ఆగినా ఆగగలదు. ఎందుకంటే ఓ డ్రాయరుసొరుగులోంచి బయటకు వచ్చిన కాళ్లూ పైనుంచి కిందకి వేలాడుతున్న శవమూ, ఓ మూలనున్న డ్రమ్ములోంచి పైకి లేస్తున్నట్లున్న భీకర దెయ్యం, మంత్రతంత్రాల తాయెత్తులతో దెయ్యాన్ని దిగ్బంధనం చేసినట్లనిపించే తలుపులూ... ఇలా అది నిజంగానే దెయ్యాల నివాసమే అనిపించేలా ఉంటుంది. అలాగని అక్కడి సర్వర్లు అందించే మెనూలో కూడా ఏ రక్తమో పుర్రెలో ఎముకలో ఉంటాయనుకుంటే మాత్రం పొరబాటే. నార్త్ ఇండియన్, ఇటాలియన్, చైనీస్, అరేబియన్ రుచులన్నీ చక్కగా వండి వారుస్తారక్కడ. సూపులూ స్టార్టర్లూ కబాబ్‌లూ కూరలూ బిర్యానీలూ డెజర్టులూ... ఇలా ఏవి కావాలంటే అవి అన్నీ ఉంటాయి. అయితే ఆయా రుచులకన్నా ఒకలాంటి ఆ భయానక వాతావరణంలో ఒక్కసారయినా తినాలన్న ఉత్కంఠతోనే చాలామంది దాన్ని సందర్శిస్తున్నారట. ఏమయినా హారర్ ఇచ్చే కిక్కే వేరు కదూ..! ★

'బాటా' అనగానే గుర్తొచ్చేవి...
ఒకటి పాదరక్షలూ,
రెండు చివర తొమ్మిదులుండే ధరలు.
123 ఏళ్ల చరిత్ర ఉన్న ఈ కంపెనీ
యాజమాన్యంలో నాలుగో తరం
వ్యక్తి థామస్ ఆర్చర్ బాటా.
తండ్రీ, తాతల బాటలో
నడుస్తున్న ఆర్చర్ గురించి
కొన్ని విశేషాలు...



# తాతలు చూపిన 'బాటా'లో!

భారతదేశంలో ఏ మూల ఉన్నవారికైనా బాటా చెప్పుల్ని అందుబాటులో ఉంచడమే నా లక్ష్యం... అంటాడు బాటా యువ వారసుడూ, సంస్థ 'గ్లోబల్ చీఫ్ మార్కెటింగ్ ఆఫీసర్' అయిన 29 ఏళ్ల ఆర్చర్ బాటా. ఇంగ్లాండ్‌లోని యూనివర్సిటీ ఆఫ్ ఎడిన్‌బర్గ్ నుంచి రాజనీతిశాస్త్రంలో పీజీ చేసిన ఆర్చర్ అయిదేళ్లకిందట కంపెనీలో మేనేజర్‌గా చేరాడు. ప్రస్తుతం గ్లోబల్ మార్కెటింగ్ బాధ్యతలు చేపడుతూ డిజిటల్, డిజైన్... విభాగాల్లో భారీ మార్పులు తెచ్చే పనిలో ఉన్నాడు.

## భారత్‌లో బాటా

ఆర్చర్ ముత్తాత థామస్ బాటా 123 ఏళ్ల కిందట చెక్ రిపబ్లిక్‌లోని సొంతూరు గ్లిన్‌లో పాదరక్షల తయారీ కంపెనీని ప్రారంభించారు. 1932లో బాటా భారత్‌లో అడుగు పెట్టింది. కోల్‌కతా సమీపంలో చిన్న సంస్థగా మొదలైన బాటాకు ఈరోజు దేశంలో 1200 దుకాణాలున్నాయి. 'చాలామంది బాటాని భారతీయ కంపెనీయే అనుకుంటారు. ఎందుకంటే ఇక్కడ బాటా పాదరక్షలు వాడని వారంటూ ఉండరు. ఇప్పటికీ ఇండియాలో అడుగుపెట్టిన ప్రతిసారీ నా పాస్‌పోర్ట్‌ని ఒకటికి రెండుసార్లు చూస్తారు. నేను భారతీయుణ్ని కాదంటే వాళ్లు నమ్మరు. బాటా భారతీయ బ్రాండ్ కాదని తెలియగానే షాకవుతారు. ఈ విషయంలో నేనెంతో గర్వపడతా... ఎందుకంటే, భారతీయుల హృదయాల్లో మేమంతగా చోటు సంపాదించినందుకు. కానీ నిజానికి బాటాలో భారతీయత ఉంది. దశాబ్దాలుగా కంపెనీ ఇక్కడ ఉంది. బాటాతో భారతీయులకు ఉన్న అనుబంధం ప్రపంచంలో మిగతా దేశాలవారికి లేదనే చెప్పాలి' అంటారు ఆర్చర్. ప్రపంచవ్యాప్తంగా బాటా ఖాతాదారుల్లో మూడింట రెండొంతులు మహిళలే. భారత్‌లో మాత్రం మహిళలకంటే పురుషులే ఎక్కువ. స్విట్జర్లాండ్‌లోని లాసనెలో సంస్థ ప్రధాన కార్యాలయం ఉంది. ప్రపంచవ్యాప్తంగా 75 దేశాల్లో బాటా అడుగులు కనిపిస్తాయి. వీరి పాదరక్షల డిజైనింగ్ ప్రధానంగా ఐరోపాలోనే జరుగుతుండగా వాటి తయారీ యూనిట్లు మాత్రం ఇటలీ, భారత్, ఇండోనేషియా, చైనాలలో ఉన్నాయి. భారత్‌లో అతిపెద్ద తయారీ కేంద్రం ఉంది. ఈమధ్య ప్రతి దేశంలోనూ డిజైనింగ్ బృందాల్ని ఏర్పాటుచేస్తున్నారు.

## నాలుగు తరాలు...

'బాటా కుటుంబం నాలుగు తరాలుగా ఇదే రంగంలో ఉంది. ఇది సాధారణ విషయమేమీ కాదు. ఎన్నో అంశాలు మమ్మల్ని ఇక్కడివరకూ తీసుకువచ్చాయి. వాటిని కొనసాగిస్తూనే విధానాల్లో కాలానుగుణమైన మార్పులు చేపడతాం. మా విధానాల్లో మారనివంటూ ఉన్నాయంటే, అవి మా విలువలు మాత్రమే' అంటారు ఆర్చర్. తన ముత్తాత ఒక అసాధారణ వ్యక్తిగా జీవించారనీ, ఆయన గురించి అందరూ చెప్పుకోవడం విన్నాననీ చెప్పే ఆర్చర్ తాను ఎక్కువగా తాతయ్య థామస్‌ని చూసి నేర్చుకున్నానంటాడు. 'వ్యాపారంలో సమస్యల గురించి ఆందోళన వద్దు. ఓటమికి భయపడకు. భయపడితే ఓడినట్టే' అని తాతయ్య చెప్పేవారు. నేనెప్పుడూ సానుకూల దృక్పథంతో ఉంటాను. నేను సానుకూలంగా ఉంటే నా బృందంలో ఉన్నవారు అసాధ్యమనుకున్నవాటిని కూడా సుసాధ్యం చేయగలరు' అంటాడు ఆర్చర్. బాటాలో ప్రస్తుతం ఆర్చర్‌తోపాటు మరొకరు మాత్రమే ఆ కుటుంబం నుంచి ఉన్నారు. ఆర్చర్ తండ్రి గతేడాదే బాటా నిర్వహణ బాధ్యతల నుంచి తప్పుకొని స్థిరాస్తి వ్యాపారంవైపు వెళ్లారు.

## డిజిటల్ వైపుగా...

ఏటా 22కోట్ల జతల పాదరక్షల్ని తయారుచేస్తోంది బాటా. వీటిలో సగం సొంతవి కాగా, మిగతా సగం భాగస్వామ్య కంపెనీలవి. 'ఖాతాదారుల అలవాట్లకు తగ్గట్టుగా మా బ్రాండ్‌నీ తీర్చిదిద్దుతున్నాం. డిజిటల్ వైపు త్వరితగతిన అడుగులు వేస్తున్నాం' అని చెప్పే ఆర్చర్, ఈ-కామర్స్ పోర్టళ్ల తరహాలో పూర్తిగా డిజిటల్‌కు వెళ్లకుండా ఆన్‌లైన్లో ఉంటూనే దుకాణాలనూ పెంచుతామంటాడు. 'పాదరక్షలకు సంబంధించి ఒక క్లిష్టత ఉంది. వాటిని అందంగా డిజైన్ చేస్తే వినియోగానికి అంత అనువుగా ఉండవు. అదే వినియోగానికి అనువుగా తయారుచేస్తే అందంగా ఉండవు. ఈ పరిస్థితిని సరిచేసేందుకు మా డిజైనింగ్ బృందం నిరంతరాయంగా పనిచేస్తుంది' అంటాడు ఆర్చర్. వివిధ దేశాల్లో 'యంగ్ డిజైనర్స్ కాంపిటీషన్'ను పెడుతూ... యువ డిజైనర్లని పాదరక్షల డిజైనింగ్ వైపు ఆకర్షిస్తోందీ సంస్థ. 'పాదరక్షలకు సంబంధించిన మరో సమస్య పొడుగు, పొట్టి పాదాలు ఉన్నవారికి ఉత్పత్తులు అందించడం. నా షూ సైజు పదకొండున్నర అంగుళాలు. నాకు నచ్చిన షూ అంత సులభంగా దొరకదు' అని తన సొంత అనుభవాన్నీ చెబుతాడు. దీనికి పరిష్కారంగా పెద్ద సైజు షూల వెరైటీలని దుకాణాల్లో కొద్ది మొత్తంలో ఉంచి, ఆన్‌లైన్లో మాత్రం ఎక్కువ మొత్తంలో పెట్టాలనుకుంటున్నట్లు చెబుతాడు. 'బాటా... పెద్దవాళ్ల బ్రాండ్' అనే ముద్ర ఉందనే ఆర్చర్ ట్రెండీగా ఉండే మోడల్స్ తెచ్చి ఆ ముద్రని పోగొడతామంటాడు.

కంపెనీ మార్కెటింగ్ ప్రధాన కార్యాలయాన్ని ఏడాది కిందట స్వదేశం చెక్ రిపబ్లిక్‌కు తీసుకెళ్లాడు ఆర్చర్. ప్రేగ్ కేంద్రంగా పనిచేస్తున్న ఆ బృందంలో పది దేశాలకు చెందిన 20 మంది సభ్యులున్నారు. 'దేశం, మతం, వయసు, ఆలోచనలు... వేర్వేరుగా ఉన్నవాళ్లు నా జట్టులో ఉన్నారు. ముందుముందు ఇక్కడికి మరింత మంది వస్తారు. ఇక్కడి చిన్న ప్రపంచం మొత్తం ప్రపంచానికి సేవలు అందిస్తుంది' అని చెబుతాడు ఆర్చర్. ★



కథ

# సర్దుబాటు

**- జ్యోతి సుంకరణం**

"మా ఆనందరావ్ బాబాయ్ కోడలు పుట్టింటికి వెళ్ళిపోయిందట" ఆఫీసు నుండి ఇంటికి వస్తూనే సోఫాలో కూలబడుతూ నీరసంగా చెప్పాడు సాగర్ భార్య ఉమతో.

"ఏంటీ, పుట్టింటికి వెళ్ళిపోయిందా..? అంటే..." ఆశ్చర్యంగా అడిగింది మంచినీళ్ళ గ్లాసు అందిస్తూ ఉమ.

"అంటే, అదే... ఇక కాపురం చెయ్యనూ అని వెళ్ళిపోయి, విడాకుల నోటీసు పంపించిందట" అన్నాడు సాగర్ బాధగా.

"అయ్యో, అదేంటండీ... నిన్నగాక మొన్నటి వరకు వాళ్ళ పెళ్ళి కబుర్లే చెప్పుకుంటున్నాం... అంతలోనే విడాకులా... ఎవరు చెప్పారీ విషయం... మీ బాబాయ్ ఫోన్ చేశారా?" అడిగింది ఉమ తను కూడా బాధపడుతూ.

"వాళ్ళ ఫ్లాట్‌లోనే ఉండే మా కొలీగ్ చెప్పాడు. చూశావా, ఇంత జరిగినా మా బాబాయ్ చూచాయగానైనా ఈ విషయం నాతో చెప్పలేదు. పైగా ఈ సంబంధం కుదిర్చినవాణ్ణి నేను" అన్నాడు సాగర్ ఫీలవుతూ.

"అవున్నిజమే కానీ అసలు ఏం జరిగి ఉంటుందంటారు... నిన్నగాక మొన్న పెళ్ళైన వారు అప్పుడే విడాకులదాకా వెళ్ళాల్సిన



అవసరం ఏమొచ్చిందంటారూ..." అంటూ ఆలోచిస్తూ తను కూడా సోఫాలో కూలబడింది ఉమ.

"అదే నాకూ అసలు అర్థంకావటం లేదు. అసలు నిజమేంటో కూడా తెలీదు. నేను రేపే బాబాయ్ ఇంటికి వెళ్ళి విషయమేంటో కనుక్కొస్తాను" అన్నాడు సాగర్.

"వాళ్ళేం మనకు చెప్పలేదు కదా, అలాంటిది మనం డైరెక్ట్‌గా వెళ్ళి అడిగేస్తే బావుంటుందా?" అంది ఉమ సందేహంగా.

"వాళ్ళు చెప్పకపోతేనేం, విషయం తెలిసి కూడా నాకేం సంబంధంలేనట్టు ఎలా ఉండిపోతాను... పెళ్ళి కుదర్చడానికి ఎన్నిసార్లు వారి ఇరుకుటుంబాల మధ్యా రాయబారాలు నడిపానో, ఈరోజు అది విచ్ఛిన్నం కాకుండా చూడటానికి కూడా నా వంతు ప్రయత్నం నేను చేస్తాను" అన్నాడు ఓ దృఢసంకల్పంతో సోఫాలో నుండి పైకిలేస్తూ సాగర్.

★ ★ ★

కాలింగ్‌బెల్ వినిపించడంతో డోర్ తీసి "ఆ... నువ్వా... రా, లోపలికి" అంటూ గుమ్మంలో నిలబడ్డ సాగర్‌ని చూసి చేదు మింగినట్లుగా మొహం పెట్టి లోపలికి ఆహ్వానించాడు ఆనందరావ్.

లోపల కూర్చున్న పావుగంటకి "నువ్వా సాగర్, బావున్నావా? మీ ఆవిడా పిల్లలూ అంతా బావున్నారా?" అంటూ లోపల నుండి చేతులు తుడుచుకుంటూ వచ్చింది ఆనందరావ్ భార్య సీత. సాగర్‌ను చూసి ఒక బలవంతపు నవ్వు నవ్వి తను కూడా ఓ కుర్చీలో కూర్చుంటూ "అసలు నిన్నే రమ్మని ఫోన్ చేద్దామనుకుంటున్నాం... ఇంతలో నువ్వే వచ్చావ్" అంది.

"నేనో విషయం విన్నాను... అది నిజమో కాదో తెలుసుకుందామని వచ్చాను" ఇక నాన్చుడు వ్యవహారం ఎందుకని సూటిగా విషయంలోకి వచ్చేస్తూ అడిగాడు సాగర్, వచ్చి పావుగంటైనా పెదవి విప్పకుండా పేపర్లో తలదూర్చిన ఆనందరావ్ బాబాయ్‌ని చూస్తూ.

ఆ మాటకి "ఒరేయ్, నిన్ను నమ్మి ఆ కుటుంబంతో సంబంధం కలుపుకున్నాం, మాకు తగిన శాస్తి జరిగింది" ఆవేశంగా పేపర్ మడిచి పక్కన పడేస్తూ అన్నాడు ఆనందరావు.

"అదేంటి, ఇందులో నేనేం చేశాను, మంచి కుటుంబం, మంచిపిల్ల. అసలు ఇంతకీ ఏం జరిగిందో చెప్పు బాబాయ్" అన్నాడు సాగర్, మొదట కోపం తెచ్చుకున్నా తర్వాత అనునయంగా.

దాంతో మొగుడూ పెళ్ళాం ఇద్దరూ కలిసి- "ఆ పిల్లకి అసలు మంచీ మర్యాదా లేదు. పెద్దవాళ్ళంటే గౌరవం లేదు. భర్తంటే అసలు ప్రేమాభిమానాలే లేవు. అయ్యో... రోజూ కాదు, ఏ పండగనాడో, పబ్బంనాడో కాస్త ఉదయాన్నే లేచి స్నానం చేయమంటే పెద్ద రాద్ధాంతం చేస్తుంది. రాత్రి పొద్దుపోయే దాకా ఫోన్లో ఛాటింగులూ, వీకెండ్ పార్టీలూ. తను సంపాదించిన జీతమంతా తనిష్టంట. దాంతో ఏం చేస్తావని అడిగే హక్కు మొగుడికి కూడా లేదట. రాత్రి ఏ పదింటికో ఆఫీసు నుండి రావడం, వస్తూనే తన గదిలోకి దూరి తలుపేసుకోవడం..." ఇలా ఓ పేద్ద చేంతాడంత చిట్టా విప్పారు- ఓ గంటకు పైగానే.

విన్నంతసేపూ విన్న సాగర్ "ఇవన్నీ సరేరా, ముందు నువ్వేం అనుకుంటున్నావో చెప్పు" అని అడిగాడు ఈ మాటల మధ్యలోనే తన పక్కనవచ్చి కూర్చున్న వివేక్‌ని.

"నేను అనేదేముంది అన్నయ్యా, అమ్మానాన్నా ఫేస్ చేసింది కొంచెమే. నేను అయితే నరకం చూశాను" అన్నాడు వివేక్ తట్టుకోలేనట్లు మొహంపెడుతూ.

"అంటే ఏంటి... కొంచెం అర్థమయ్యేటట్లు చెప్పు" అన్నాడు సాగర్.

దానికి విసుగ్గా మొహంపెట్టి "తనకి విపరీతమైన 'ఇగో', అది భరించడం నావల్ల కాదు" అన్నాడు.

సాగర్ కాసేపు ఏం మాట్లాడకుండా ఉండి, ఆ తర్వాత "బాబాయ్, నేనే వెళ్ళి వాళ్ళతో మాట్లాడతాను. జరిగిందేదో జరిగింది... ఇక మీదట మీకు నచ్చే విధంగా ఉండమని నచ్చచెప్పి తీసుకొస్తాను" అన్నాడు బుజ్జగింపుగా.

"ఒరినీ... అమాయకత్వమూ నువ్వూనూ... ఆ పిల్ల అలా వినే రకం కాదురా, జగమొండి. అయినా వద్దురా బాబూ చాలు. ఎవరో నచ్చచెప్పారని ఇక్కడికి వచ్చి ఇక్కడేదైనా చేసుకుందనుకో- మా కుటుంబం మొత్తం జైలు పాలవుతాం. ఇప్పటికి బజార్నపడ్డది చాలు" అన్నాడు ఆనందరావ్ చేతులు రెండూ పైకెత్తేస్తూ.

"వదిలెయ్యి అన్నాయ్, ఇదంతా ముగిసిపోయిన కథ" అని ఈజీగా అనేసి విజిల్ వేసుకుంటూ బైటకి వెళ్ళిపోయాడు వివేక్.

★ ★ ★

"ఆడపిల్లని ఇచ్చినవాళ్ళమని అన్నిటికీ అణిగిమణిగి ఉండే రోజులు పోయాయి. మా పిల్లని పెద్ద చదువులు చదివించి, అతి గారంగా, అపురూపంగా పెంచుకున్నది ఎవరింటికోపోయి బానిస బతుకు బతకడానికి కాదు కదా, మీరే చెప్పండి" నిలదీసింది అన్నపూర్ణ ఆవేశంగా సాగర్‌ని.

"అదేంటండీ, అలా అనుకుంటే ఎలా? మీరూ ఓ ఇంటి ఆడపిల్లే కదా... ఆ రోజుల్లో మరి మీరు సర్దుకుపోలేదా అత్తారింటికి వచ్చి. మీరు మాత్రం చిన్నా పెద్దా గొడవలూ సమస్యలూ రాకుండానే జీవితం గడిచిపోయిందా?" అన్నాడు సాగర్ తను కూడా కాస్తంత ఆవేశంగానే.

"బావుంది... ఆ రోజులు వేరు, ఇప్పటి రోజులు వేరు. అయినా, మా పిల్ల మనసు విరిగిపోయింది, ఆ కుర్రాడి ప్రవర్తనతో. ఇక మాకూ వాళ్ళకీ కుదరదు" అని తెగేసి చెప్పేసింది అన్నపూర్ణమ్మ.

"మావాడేం అంత చెడ్డవాడు కాదు. ఏవో కొన్ని 'మిస్ అండర్‌స్టాండింగ్స్' వలన ఇంతవరకూ వచ్చింది కానీ, అసలు అందరం కూర్చుని మాట్లాడుకుంటే ఈ సమస్య పరిష్కారం అవుతుందేమో" ఆశాజనకంగా అన్నాడు సాగర్.

ఆ మాటలకి అంతవరకూ అక్కడే కూర్చుని

ఈ మాటలన్నీ వింటున్న ధరణి "ఏవో 'మిస్ అండర్‌స్టాండింగ్స్' కాదండీ, అతని ప్రవర్తన మీకేం తెలుసు. అతనొక్కడనేం కాదు, వాళ్ళందరూ అంతే. ఇన్ని రోజులూ నేనెంత టార్చర్ అనుభవించానో తెలుసా? ఆఫీసులో పని ఎక్కువై, ఇంటికి లేట్‌గా వస్తే అదొక తప్పా? ఏదో వారమంతా అలసిపోతాం, వీకెండ్స్‌లో సరదాగా ఒకరోజు ఫ్రెండ్స్‌తో గడిపితే అదీ పెద్ద నేరమేనా? నేనేమిటీ, నా చదువేంటీ? రోజూ ఇంటిపనీ, వంటపనీ చేసుకుంటూ కూర్చుంటే నా కెరీర్ ఏమవుతుందీ, నా టార్గెట్స్ ఎలా కంప్లీట్ అవుతాయి? వాళ్ళకి ఇంటికి ఓ కోడలు కాదు కావాల్సింది, ఒక రోబో కావాలి. దానికీ ఏ ఫీలింగ్స్ లేకుండా చెప్పిందల్లా చెయ్యాలి. కూర్చుని మాట్లాడుకోవడం కాదు కదా... ఇకమీదట నా వాల్యుబుల్ టైమ్‌లో ఒక్క సెకను కూడా వాళ్ళకోసం వేస్ట్ చేయదలచుకోలేదు. అంత 'పేషన్స్' అసలు నాకు లేదు... దట్సాల్" అంటూ లోపలికి వెళ్ళిపోయింది విసురుగా, సహనశీలి, భూమాత పేరు పెట్టుకున్న ధరణి.

'మరి మీరేం అంటారు' అన్నట్లు ధరణి తండ్రి విశ్వనాథ్ మొహంలోకి చూశాడు సాగర్.

దానికి సమాధానంగా "మనమేం చేస్తాం, ఇప్పటి పిల్లలకి అన్నీ తెలుసు. మనం కన్విన్స్ చేస్తే కన్విన్స్ అయ్యే స్టేజీలో లేరు వాళ్ళు. ఇప్పటివరకూ జరిగిందేదో పీడకల అనుకుని మర్చిపోవడమే" అంటూ ఇక మాట్లాడటానికేం లేదు అన్నట్లు పెదవి విరుస్తూ పైకి లేచాడు.

★ ★ ★

"ఏవండీ చూశారా, 'చక్కటి జంట విడిపోయారు, వాళ్ళ జీవితాలేంటో, వాళ్ళ భవిష్యత్ ఏంటో' అంటూ వాళ్ళని కన్నవాళ్ళకన్నా మీరెక్కువ బెంగ పెట్టుకుని బాధపడిపోయారు ఈ ఆర్నెల్లుగా. ఇప్పుడు చూడండి... చక్కగా ఇలా విడాకులు రావడమేంటీ అలాగ చెరొకళ్ళనీ చేసేసుకుని మళ్ళీ ఫ్రెష్‌గా సంసారాలు మొదలుపెట్టడానికి రెడీ అయిపోయారు" అంది ఉమ, సాగర్ చేతిలో అటు వివేక్, ఇటు ధరణిల పెళ్ళి పత్రికలను విడివిడిగా చూస్తూ.

"ఏంటో ఈ కాలం... పెళ్ళిళ్ళు చేసుకోవడం - అక్కర్లేదనుకుంటే విడిపోవడం ఇంత మామూలు అయిపోయిందా - అనుకుంటే చాలా బాధగా ఉంది. పిల్లలు సరే ఆవేశపడతారు, కానీ బుద్ధులు చెప్పాల్సిన పెద్దలే ముందూ వెనకా ఆలోచించకుండా నిర్ణయాలు తీసేసుకుంటున్నారు. వివేక్, ధరణీలు ఇద్దరినీ కలిపి వారి వివాహబంధం చెడిపోకుండా చూడాలని ఎంత ప్రయత్నించానో నీకూ తెలుసుకదా. ఎవరిమటుకు వారే 'తప్పు అవతలి వారిదే'నంటూ విడిపోవడమే ధ్యేయంగా పెట్టుకుని నిందలు వేసుకున్నారు. పోనీ, అంత విడిపోయే సమస్యలా అంటే కానే కావు" అన్నాడు సాగర్ చాలా బాధగా.

"ఒక్క వివేక్, ధరణీలే కాదు, చాలా జంటలు ఎంత హడావుడిగా విడిపోతున్నారో మళ్ళీ అంతే హడావుడిగా ఇంకోళ్ళని చేసుకుంటున్నారు. ఆ ఇంకోళ్ళతో కూడా అడ్జస్ట్ అవ్వలేకపోతే ఏం చేస్తారో?" సాలోచనగా అంది ఉమ.

"ఆ... అలాంటి చికాకులు రాకుండా ఉంటాయనే ఇపుడు కొత్తగా ఓ ట్రెండ్ నడుస్తోందిగా... అదే- 'సహజీవనం'. స్టైల్‌గా చెప్పాలంటే 'లివింగ్ టుగెదర్'. అదయితే బంధాలూ బాధ్యతలూ ఉండవ్. కావలిస్తే కలిసి ఉండొచ్చు లేదంటే విడిపోవచ్చు. ఏంటో, ఎక్కడుందో లోపం... అన్ని దేశాలవాళ్ళూ మన వివాహ వ్యవస్థని మెచ్చుకుని ఆచరిస్తుంటే, మనం మాత్రం దాన్ని ఎలా నాశనం చేసుకోవాలా అని ఆలోచిస్తున్నాం. దేశం ఎటు పోతోందో, మన భవిష్యత్తు తరాలు ఎటు వెళతాయో" అని సాగర్ అంటూండగానే-

"అమ్మా... అమ్మా..." అంటూ విసురుగా వచ్చి వీపుకున్న స్కూల్ బ్యాగ్‌ని ధన్‌మని కిందకు పడేస్తూ "రేపటి నుండి ఈ స్కూల్‌కి నేను వెళ్ళనమ్మా" అంది ఏడుపు గొంతుతో



సాగర్, ఉమల గారాల పట్టి పన్నెండేళ్ళ సుజీ.

"ఏంటి తల్లీ ఏమయిందీ, రెండు నెలలే కదా అయింది ఈ స్కూల్లో జాయినయి, అప్పుడే ఏమొచ్చింది?" అన్నాడు కాస్త విసుగ్గా సాగర్.

"వద్దు నాన్నా, నాకీ స్కూలు వద్దు... వద్దంటే వద్దు. రేపట్నుంచీ నేను వెళ్ళనంతే" అంటూ కాళ్ళు విసురుగా నేలకేసి కొడ్తూ తన గదిలోకి పోయింది.

"ఏంటి ఉమా... బోల్డంత ఫీజులు కట్టి మొన్నే జాయిన్ చేశాం, సడన్‌గా వెళ్ళనంటుందేంటి?" అన్నాడు సాగర్, వెళ్ళిపోతున్న కూతురి వైపు గాభరాగా చూస్తూ.

"అదేం సడన్‌గా అనటంలేదు, జాయిన్ చేసిన పది రోజుల నుండీ ఆ స్కూల్ నచ్చలేదని పోరు పెడుతూనే ఉంది. ఏం చేస్తాం, ఇష్టం లేదంటోంది కదా... అయినా ఫస్ట్ టర్మ్ ఫీజు మాత్రమే కట్టాం కదా, పోతేపోయిందనుకుని వేరే స్కూల్- దానికి నచ్చినదాంట్లో జాయిన్ చేద్దాం. మనకు దగ్గర్లోనే ఇంకో స్కూల్ ఉంది కదా" అంది ధీమాగా ఉమ.

"అది కూడా నచ్చకపోతే" కాస్త కోపంగా అరిచినట్లు అడిగాడు సాగర్.

"ఏంటీ, అంత సీరియస్ అవుతున్నారు. దానికి నచ్చలేదన్నా- రోజూ ఏడుస్తూ వెళుతున్నా ఆ స్కూల్‌కే పంపించాల్సిన అవసరమేంటి, దగ్గరలో మరొక స్కూల్ అందుబాటులో ఉండగా. డబ్బు పోతుందనుకుంటే ఎలాగ... పిల్ల సంతోషంగా ఉండటమే కదా కావాలి" అంది ఉమ కూడా కాస్త కోపంగా.

ఆ మాటలకి సాగర్ కాసేపు మౌనంగా ఉండి, ఆ తర్వాత దీర్ఘంగా నిట్టూరుస్తూ "అదీ సంగతి... నాకు ఇప్పుడు అర్థం అవుతోంది- అవకాశం, అందుబాటు ఉన్నాయి కాబట్టి దాన్ని ఇందులో అడ్జస్ట్ అవ్వమని మనం చెప్పట్లేదన్న మాట. ఇది కాకపోతే ఇంకోటి, అదీ కాకపోతే మరొకటి... ఈరోజు చదువూ, బట్టల విషయంలో అయిందీ, రేపు పెళ్ళి విషయంలోనూ అవుతుంది" అన్నాడు.

"అదేంటి, ఇంత చిన్న విషయాన్ని అంత పెద్ద విషయాలతో పోలుస్తారు" అంది ఉమ విసుగ్గా.

"లేదు ఉమా, ఇవాళ చిన్న విషయమనీ, మనకి పెద్దగా ఇబ్బందిలేనిదనీ తేలిగ్గా తీసుకుంటున్నాం కాబట్టే ఇప్పటి పిల్లలకి దేని విలువా తెలీటం లేదు. కొత్తగా వెళ్ళినపుడు ఏదైనా పూర్తిగా నచ్చకపోవచ్చు. కొన్ని రోజులు ఓపికపట్టి 'అడ్జస్ట్' అయితే, అది మనది అన్న సొంత భావన కలుగుతుంది. దాంతో నెమ్మది నెమ్మదిగా అక్కడ అన్నీ నచ్చడం మొదలవుతాయి" అన్నాడు సాగర్.

"ఏ విషయాన్ని ఏ విషయంతో పోలుస్తున్నారు. దానికి ఇష్టంలేని స్కూల్‌కి ఇపుడు బలవంతంగా పంపిస్తారా?" అంది ఉమ.

"లేదు, దాన్ని బలవంతంగా పంపించను. ఇష్టపడి వెళ్ళే విధంగా మారుస్తాను. రేపట్నుంచీ తరచుగా దానితోపాటు స్కూల్‌కి వెళ్ళి అక్కడ ఏం నచ్చలేదో, ఎందుకు నచ్చలేదో తెలుసుకుంటాను. అందుకు కారణాలేంటో దానికీ అర్థమయ్యేలా వివరంగా చెప్తాను. దాని మనసులోని అపోహలన్నీ తొలగించి ఆనందంగా వెళ్ళేలాగా చూస్తాను. ఇప్పుడు ఈ వయసులోనుంచే సర్దుకుపోవడం, నలుగురితో షేర్ చేసుకోవడం లాంటివి అలవాటుచేస్తే భవిష్యత్తులో తొందరపాటు నిర్ణయాలూ, ఆవేశపు ఆలోచనలూ చేయకుండా జీవితాలను ఆనందమయం చేసుకోగలుగుతారు. విడాకులూ వివాహ వ్యవస్థ చిన్నాభిన్నం కావడం- ఇవన్నీ ఈ తరం పిల్లల ఆలోచనలంటూ మొత్తం వాళ్ళమీదకు తోసెయ్యడం కరెక్ట్ కాదు. వాళ్ళకు చిన్నప్పట్నుంచీ ఒకటి నచ్చకపోతే ఇంకోటీ, ఇంకోటి నచ్చకపోతే మరోటీ అనే ఛాయిస్‌ల మీద పెంచి, 'యూజ్ అండ్ త్రో' వస్తువులనే కొని ఇస్తూ, దేని విలువా తెలియకుండా సర్దుబాటు అన్నమాటే లేకుండా పెంచుతున్న పెద్దలదే తప్పంతా. ఇకమీదట మనమైనా బాధ్యతగల తల్లిదండ్రులుగా 'ఛాయిస్ అండ్ యూజ్ అండ్ త్రో' సిస్టమ్‌లో కాకుండా, 'అడ్జస్ట్‌మెంట్ అండ్ రిపేర్' సిస్టమ్‌లో పిల్లల్ని పెంచుదాం" అంటూ, కూతురు అడ్డదిడ్డంగా పడేసి వెళ్ళిన స్కూలు బ్యాగుని తీసి సక్రమంగా పెట్టాడు సాగర్. ★

ప్రపంచంలోకెల్లా ఉత్తమ ఉద్యోగం ఏదీ అంటే- 'ఆస్ట్రేలియా పగడపు దీవుల సంరక్షకుడు/సంరక్షకురాలు' అని చెబితే పప్పులో కాలేసినట్లే. ఎందుకంటే ఇప్పుడు చాలామంది 'పాండా నానీ'దే వరల్డ్ బెస్ట్ అండ్ ఫన్ జాబ్ అంటున్నారు. ఎందుకో తెలుసా..?







# 'పాండా నానీ'కి రూ.2 లక్షల జీతం!

ఆస్ట్రేలియా పగడపుదీవుల సంరక్షకుడికి నిజానికి పెద్దగా పనేమీ ఉండదు. అక్కడే ఉంటూ అప్పుడప్పుడూ సముద్రంలోకి వెళుతూ ఆ కోరల్ రీఫ్స్ పరిస్థితిని అంచనా వేస్తూ వాటి గురించిన విశేషాలను ఆయా శాస్త్ర నిపుణులకు అందజేయడంతోబాటు, ఆ ప్రదేశం గురించి చూడచక్కని వర్ణనలతో రాసిన కథనాలను వెబ్‌సైట్‌లో పెట్టడమే చేయాల్సిన పని. అందుకుగాను ఆరు నెలలకి సుమారు కోటి రూపాయల పారితోషికాన్ని అందుకోవచ్చు అన్న కారణంతోనే అది ఉత్తమ ఉద్యోగం. అయితే చైనా 'పాండా నానీ'(దీన్నే మాండరిన్ భాషలో దుహ్ అంటారు) విషయంలో అందరినీ ఆకర్షిస్తున్నది జీతంకన్నా ఎక్కువగా పాండా డ్రెస్సింగే. అవునండీ, చైనాలోని సిచువాన్ ప్రాంతంలోని వూలాంగ్ నేషనల్ నేచర్ రిజర్వ్‌లోనూ ఇతర పాండా సంరక్షణ కేంద్రాల్లోనూ బేబీ పాండాల సంరక్షణకోసం వాటిని చూసుకునేవాళ్లంతా పాండాల్లా డ్రెస్ చేసుకోవాలిట. అయినప్పటికీ దానికి అనేకమంది పాండా ప్రేమికులు పోటీపడుతూ ఇది అత్యుత్తమ ఉద్యోగం అని పేర్కొనడం విశేషం. అలాగని జీతం కూడా మరీ తక్కువేం కాదు, నివాసం, భోజన సదుపాయాలతోబాటు ఖరీదైన కారు ఇచ్చి ఏటా సుమారు 22 లక్షల రూపాయలకు పైగా జీతం ఇస్తున్నారట. అభ్యర్థులకు 22 ఏళ్ల వయసుండి పాండాల గురించి కనీస అవగాహన కలిగి ఉండటంతో బాటు వాటి గురించి రాయడం, ఫొటోలు తీయడంలో నైపుణ్యం ఉండి ఉండాలి.

## ఆ వేషధారణే ఎందుకు?

పాండాలు మనుషుల్ని చూసి భయపడతాయనో పారిపోతాయనో కాదు వాళ్లు ఆ డ్రెస్సింగ్ చేసుకునేది. మనుషుల జోక్యం లేకుండా అడవిలో ఇతర వన్యమృగాల మధ్యలో ఎలా జీవించాలో నేర్పించేందుకే వాళ్లు అలా డ్రెస్ చేసుకుంటున్నారు. వినడానికి విచిత్రంగా ఉన్నా ఇదే నిజం. ఎందుకంటే అంతరించిపోతోన్న జీవజాతుల్లో పాండాలొకటి. సహజంగా పాండాలు మాంసాహారులే అయినా అవి ఎక్కువగా వెదురు మొక్కల ఆకుల్ని మాత్రమే తింటుంటాయి. రోజులో సగం సేపు వాటినే నములుతుంటాయి. కానీ ఆ వెదురులో అన్ని రకాల పోషకాలూ అందకపోవడంతో అవి చాలా త్వరగా చనిపోతున్నాయి. దాంతో చైనా ప్రభుత్వం గత దశాబ్దకాలంగా పాండాల రక్షణకోసమూ ఆ జాతి పునరుద్ధరణ కోసమూ కట్టుదిట్టమైన చర్యలు చేపట్టింది. కానీ కొంతకాలంపాటు సంరక్షించి, ఆ తరవాత వాటిని అడవిలోకి వదలడంవల్ల అవి సొంతంగా జీవించలేకపోతున్నాయట.

సుమారు పదేళ్ల క్రితం జియాంగ్‌జియాంగ్ అనే పాండా పిల్లను మూడేళ్లపాటు సంరక్షించి అడవిలోకి వదిలితే, అది మొదట్లో ఆ వాతావరణానికి బాగానే అలవాటుపడినట్లు అనిపించిందట. కానీ అక్కడి పాండా గ్రూపుల మధ్య జరిగిన కొట్లాటలో చనిపోయింది. దాంతో పాండా పిల్లలకు ముందు నుంచీ కూడా పాండాల మధ్యలో ఉన్న భావన కలిగించి, అడవిలో మిగిలినవాటితో కలిసిపోయి జీవించడం నేర్పించేందుకే ఈ ఏర్పాటంతా. ఆ కారణంతోనే మొదట్లో శాస్త్రవేత్తలే స్వయంగా పాండాల మాదిరిగా డ్రెస్ చేసుకోవడం ప్రారంభించారు. అదే క్రమంగా ఈ సరికొత్త పాండా డ్రెస్సింగ్ కేర్‌టేకర్ ఉరఫ్ పాండా నానీ ఉద్యోగాలకి దారితీసిందన్నమాట. ఉద్యోగంలో చేరినవాళ్లు అనుక్షణం వాటిని కంటికి రెప్పలా కాపాడుతుండాలి. ముఖ్యంగా బేబీ పాండాల్ని ఎంతో జాగ్రత్తగా చూడటంతోబాటు, వాటి ప్రతి కదలికనీ సీసీ కెమెరాల్లో చూసి ఎప్పటికప్పుడు వాటికి హెల్త్ చెకప్‌లు చేయడం, మందులు ఇవ్వడం చేస్తుండాలి. అయితే ఈ ఉద్యోగంలో వాళ్లకు కష్టంగా అనిపించే అంశం మాత్రం ఒకటి ఉంది. అదేమంటే పిల్లపాండాలని చుట్టూ ఉన్నవాళ్లంతా పాండాలని నమ్మించే ప్రయత్నంలో భాగంగా వాటి మూత్రాన్ని కూడా ఒంటిమీద చల్లుకోవాలట. అయినప్పటికీ ప్రపంచవ్యాప్తంగా లక్షలాదిమంది ఈ ఉద్యోగాలకి పోటీపడటం విశేషం. ఏమైనా చైనీయులు పాండాలమీద చూపిస్తోన్న ఈ ప్రేమకు 'పాండరింగ్' అన్న పదమే సరైనదేమో! ★





# చిన్నారి సంరక్షణ కోసం తల్లిదండ్రులకు సూచనలు



శిశువు అత్యంత వేగంగా పెరుగుతుంది, 4 నెలల వయసుకల్లా శిశువు పుట్టినప్పటి బరువుకు రెండింతలవుతుంది మరియు 1 సంవత్సరం వచ్చేటప్పటికీ పుట్టినప్పటి బరువుకు మూడింతలు పెరుగుతుంది మరియు తొలిదశలోని ఎత్తుకు కనీసం 50% ఎత్తు పెరుగుతుంది. శిశువు యొక్క పెరుగుదల మరియు అభివృద్ధి యొక్క వివిధ దశలను మనం అర్థం చేసుకుందాము.

## బాల్యంలో చిన్నారి ఎలా సంభాషిస్తుంది ?

స్పృశించడం ద్వారా చిన్నారి తన మొదటి భావ వ్యక్తీకరణను ప్రారంభిస్తుంది; తాకడం ద్వారా వారు తమ అవసరాలను మరియు భావోద్వేగాలను తెలుపుతారు. వారికి నాలుగు నెలల వయసు వచ్చేటప్పటికి వారు తమ రెండు చేతులను ఉపయోగించటానికి, వస్తువులను పట్టుకోవటానికి మరియు వాటిని నోట్లో పెట్టుకోవడానికి ప్రయత్నిస్తారు.

## శిశువులకు తక్కువ కంటిచూపు ఉంటుంది అనేది నిజమేనా ?

అప్పుడే పుట్టిన శిశువులకు తొలుత అస్పష్టమైన కంటిచూపు ఉంటుంది. ఆరు నుండి ఎనిమిది వారాల వయసు వచ్చిన తర్వాత వారి తల్లిదండ్రుల యొక్క కదలికలను అర్థంచేసుకొనే స్థితికి వారు చేరుకుంటారు మరియు వారి తల్లిదండ్రులు 15-45 సె.మీటర్ల దూరంలో ఉన్నప్పుడు వారి స్పందనను గమనించవచ్చును. చిన్నారి యొక్క కంటిచూపు వారికి నాలుగు నెలల వయసు వచ్చేసరికి ఇంకొంచెం మెరుగుపడుతుంది.

## బిడ్డ కడుపులో ఉన్నప్పుడు వినడం ప్రారంభిస్తుందా ?

తల్లి నిండు చూలాలుగా ఉన్నప్పుడు గర్భస్థ శిశువు కొన్ని స్వరాలను గుర్తించడం ప్రారంభిస్తుంది మరియు ఆ స్వరాలు వారికి స్వాంతనను చేకూరుస్తాయి; బిడ్డకు 6-8 వారాల వయసు వచ్చినప్పుడు ఈ గుర్తించబడిన స్వరాలకు చిన్నారి సంతోషంగా ప్రతిస్పందించడం ప్రారంభిస్తుంది.

## శిశువు పెరుగుదలకు మరియు అభివృద్ధికి ప్యాంపర్స్ ఎలా దోహదపడుతుంది ?

చిన్నారులు పాకడం మరియు నడవటానికి ప్రయత్నించడం ప్రారంభించినప్పుడు శుభ్రంగా ఉంచే, తేమను పీల్చే మరియు చిన్నారి యొక్క మెత్తటి చర్మానికి అనువైన మరియు సౌకర్యాన్ని అందించే డైపర్‌ను కలిగియుండటం ఎంతైనా అవసరం. ప్యాంపర్స్ ప్యాంట్స్ గరిష్టంగా 12గంటల వరకు మూత్రాన్ని పీల్చుతుంది మరియు తద్వారా చిన్నారికి రాత్రిపూట మంచి నిద్రను కలుగజేస్తుంది మరియు చక్కటి రాత్రిపూట నిద్ర చిన్నారి యొక్క పెరుగుదలకు మరియు అభివృద్ధికి చాలా ముఖ్యం.

## ప్యాంపర్స్ యొక్క ప్రత్యేకతలు/విశిష్టతలు ఏమిటి ?

చిన్నారులు పెరిగే కొద్ది మరియు తమ పరిసరాలను పరిశీలించటం ప్రారంభించే కొద్ది వారికి శుభ్రమైన మరియు పొడిగా ఉండే, అంతేగాకుండా మెత్తటైన మరియు సౌకర్యవంతమైన అమరికను అందించే డైపర్ వారికి అవసరం. ప్యాంపర్స్ ప్యాంట్స్ యొక్క పీల్చే పొర నీటిని మరియు తేమను గరిష్టంగా పీల్చే సామర్థ్యాన్ని కలిగిఉంటుంది మరియు దానిలో ఉండే మ్యాజిక్ జెల్ పీల్చుకున్న తేమను ఘనపదార్థం రూపంలో 12గంటల పాటు ఉంచుతుంది. చిన్నారి నిద్రపోతున్నప్పుడు కానీ, కూర్చున్నప్పుడు కానీ లేదా పరిసరాలను అన్వేషిస్తున్నప్పుడుకానీ తేమనుండి సంరక్షణను మరియు మంచి అమరికను రెండింటినీ ప్యాంపర్స్ ప్యాంట్స్ అందిస్తుంది.

1. ప్యాంపర్స్ ప్యాంట్స్ వాటి అదనపు పీల్చే పొరలు మరియు మ్యాజిక్ జెల్‌తో 12గం.ల వరకు తడిని నిరోధిస్తాయి, అలా మీ చిన్నారికి రాత్రంతా ఆటంకంలేని నిద్రను కలుగజేస్తాయి మరియు మీ చిన్నారి పెరుగుదలకు దోహదపడతాయి.
2. ప్యాంపర్స్ ప్యాంట్స్ వాడటం వలన చిన్నారుల ఛాతీ వరకు విస్తరించకుండా కారుట నుండి తడిని నిరోధించటానికి దోహదపడుతుంది, అందువలన చలి పుట్టకుండా ఉంచేందుకు చిన్నారికి దోహదపడుతుంది.
3. లెగ్ కఫ్లలోని ఎలాస్టిక్ మెటీరియల్ ఉన్నతమైన అమరికను కలిగి ఉంటుంది మరియు కారుటను నిరోధిస్తుంది. మెత్తటి ఎలాస్టిక్‌తో పైకిలాగే ప్యాంట్ రకం అయినందున, ఇది చిన్నారుల నడుము చుట్టూతా పట్టి ఉంచుతుంది, ఇది చిన్నారులు కదిలినప్పుడు కూడా జారిపడకుండా పట్టి ఉంచుతుంది.

# బాల వినోదిని

## ఏటీఎం కిడ్డీబ్యాంక్!




మనం కిడ్డీ బ్యాంకుల్లో చాలా రోజుల్నుంచే డబ్బులు దాచిపెడుతూ ఉంటాం. కావలసినప్పుడు తీసుకుంటాం. కానీ అమ్మానాన్నలు మాత్రం తమ డబ్బులు తీసుకోవడానికి ఏటీఎంకు వెళుతుంటారు. అక్కడి మెషీన్ మీద ఏవో అంకెలు నొక్కి డబ్బులు తీసుకుంటూ ఉంటారు. ముట్టుకోనివ్వరు కానీ, మనకూ అలా నొక్కి డబ్బులు తీసుకోవాలని సరదా ఉంటుంది కదూ! అందుకే ఇప్పుడు కిడ్డీబ్యాంకుల్లోనే 'ఏటీఎం టాయ్ మెషీన్'లుగా పిలిచే కొత్త రకానివి బజార్లోకి వచ్చాయి. ఇందులో మనం నోట్లు వేయడానికీ, చిల్లర వేయడానికీ విడివిడిగా ఏర్పాటు ఉంటుంది. తిరిగి డబ్బులు తీసుకోవాలంటే మాత్రం మనం పెట్టుకున్న కోడ్‌ని నొక్కాల్సిందే. అప్పుడే ఆ డబ్బా తలుపు తెరుచుకుంటుంది. కొన్ని రకాల ఏటీఎంలలో అయితే చిన్న కార్డు కూడా ఉంటుంది. అది పెట్టి మనం కోడ్ నొక్కాక, ఒక బటన్ నొక్కితే మనం దాచుకున్న డబ్బులు ఎన్ని ఉన్నాయి అన్నది అక్కడి చిన్న తెరమీద కనిపిస్తుంది. పక్కనే 100, 200 ఇలా అంకెలున్న బటన్లు ఉంటాయి. మనకు ఎంత కావాలంటే ఆ నంబరు రాసి ఉన్న బటన్‌ను నొక్కితే అన్నే డబ్బులు అందులో నుంచి వాటంతట అవే బయటకి వస్తాయి. అంటే అచ్చం మన పెద్దవాళ్లు వాడే ఏటీఎంలోలాగే అన్నమాట. కొత్త కిడ్డీబ్యాంకులు బాగున్నాయి కదూ!

## దారి కనుక్కోండి

కింద ఉన్న పాపను పైన ఉన్న వాళ్ల నేస్తం దగ్గరికి చేర్చండి



## గబగబా

ఇక్కడున్న పదాలను గబగబా అనండి.

SAD SNOW MEN SAT

THREE TEA TREES

TRAGEDY STRATEGY

## పదాలు పట్టుకోండి

బొమ్మను చూసి ఉ, ఊ అక్షరాలతో మొదలయ్యే కొన్ని పదాలను చెప్పండి.



## తేడాలేంటి?

ఈ రెండు బొమ్మల మధ్య ఉన్న ఎనిమిది తేడాలను కనిపెట్టండి.



పూర్వం ఒక అడవిలో రకరకాల పక్షులూ, జంతువులూ కలిసి మెలసి సంతోషంగా జీవిస్తుండేవి. అదే అడవిలో చింపూ అనే కోతి కూడా ఉండేది. పక్షుల గూళ్లను నాశనం చేయడం, తోటి జంతువులను గోళ్లతో రక్కడం, తోకలు పీకడం లాంటి పనులు చేస్తూ వాటిని ఏడిపించేది. దాంతో విసుగెత్తిన జంతువులన్నీ ఒక దగ్గర సమావేశమై ఆ కోతికి ఎలా బుద్ధి చెప్పాలా అని ఆలోచిస్తుంటే... దాని పొగరు అణచే ఉపాయం తన దగ్గరుందని ముందుకొచ్చింది సుబుద్ధి అనే నక్క. చింపూ దగ్గరకెళ్లి 'మిత్రమా! నువ్వెంత అందంగా ఉన్నావో! బంగారు రంగు వెంట్రుకల వల్ల నీ అందం మరింత పెరిగింది' అంటూ కాకా పట్టడం మొదలుపెట్టింది సుబుద్ధి. 'నీకు ఆ ఒక్క లోపం లేకపోతే అందంలో నిన్ను మించిన వారుండరంటే నమ్ము' అంది. ఆ మాటలకు ఉబ్బిపోయిన కోతి 'ఏమిటా లోపం?' అని పొగరుగా ప్రశ్నించింది. 'ఎర్రగా ఉండే శరీరం నీకస్సలు నప్పలేదు. నేను చెప్పినట్టు చేశావంటే నీకు తిరుగే ఉండద'ని మభ్యపెట్టింది నక్క. తన అందం మరింత పెరుగుతుందన్న ఆనందంలో ఉన్న కోతి 'ఏం చేయాలో చెప్పు' అంది. 'ఏనుగు నుదుటి భాగంలో మన అందాన్ని పెంచే ఒక పండు ఉంటుంది. అది తిన్నావంటే నీ ముఖం మెరిసిపోతుంది. ఏనుగు కన్పించగానే నుదుటి భాగంలో తగిలేలా రాయి విసురు. అప్పుడు ఆ పండు తొండంలోంచి కింద పడుతుంది. ఏనుగు నిన్ను పట్టుకోవాలని వచ్చేలోపు దాన్ని అందుకొని పరిగెత్తు' అని సలహా ఇస్తుంది సుబుద్ధి. అప్పటినుంచి ఏనుగు ఎప్పుడు కన్పిస్తుందా అని ఎదురుచూసింది కోతి. ఒకరోజు ఏనుగు

## దెబ్బకు దెబ్బ



అటువైపు నుంచి వెళ్లడం చూసి తను ఉన్న చెట్టు దగరకు రాగానే నుదుటికి తగిలేలా గట్టిగా రాయి విసిరింది. నొప్పి తట్టుకోలేక దిక్కులు పిక్కటిల్లేలా ఘీంకరించింది ఏనుగు. పండు ఏదీ కింద పడినట్లు కనిపించకపోయే సరికి అది తొండంలో చిక్కుకుపోయుంటుందన్న భ్రమతో ఈసారి ఇంకొంచెం పెద్ద రాయి విసిరింది కోతి. ఆ దెబ్బతో ఏనుగుకు పిచ్చెక్కిపోయింది. తన మీద దాడి చేస్తున్నది ఎవరా అని వెతికింది. ఈసారి తను ఎదురుచూసే పండు కచ్చితంగా కింద పడుంటుందని దాన్ని అందుకోవాలని ఆత్రంగా వస్తున్న కోతిని చూసి, చంపేయాలన్న కోపంతో దాని మీదకు ఉరికింది. ఆవేశంతో వస్తున్న ఏనుగును చూసిన చింపూ దానికి దొరికితే తనకు నూకలుచెల్లినట్లేనని భావించి అడవి వదలి పారిపోయింది. తన తెలివితో కోతి ఆగడాల నుంచి తమను కాపాడినందుకు సుబుద్ధిని జంతువులన్నీ మెచ్చుకున్నాయి.

## ముక్క ఏది?

దిగువ ఇచ్చిన ముక్కల్లో బొమ్మకు సంబంధించినవి ఎన్ని? అవి ఏవి?




## మొత్తం ఎన్ని



ఈ చిత్రంలో ఒకదాని మీద ఒకటి చాలా గబ్బిలాలు ఉన్నాయి. అవి మొత్తం ఎన్ని ఉన్నాయో లెక్కించండి.



## రంగులేద్దాం





## జవాబులు

**ముక్క ఏది:** మూడు- 1, 2, 4.
**మొత్తం ఎన్ని:** 12
**పదాలు పట్టుకోండి:** ఉడుత, ఉల్లికాడ, ఉడుము, ఉమ్మెత్తపువ్వు, ఉసిరికాయ, ఉంగరం, ఊయల, ఊరు.
**తేడాలేంటి?:** 1. ఎడమవైపు చెట్టు మీద సీతాకోకచిలుక, 2. ముందు వైపు బంతి దిశ, 3. బొమ్మ పట్టుకున్న పాప స్కర్టు మీది డిజైన్, 4. బంతి పక్కనున్న కేకు స్థానంలో కాఫీ కప్పు, 5. ఎడమ వెనుక చెట్టుమీద పువ్వు, 6. మధ్యలో కేకు మీద క్యాండిల్, 7. గులాబీరంగు గౌను వేసుకున్న పాప చేతిలోని పళ్లెంలో పదార్థాలు, 8. బుట్ట హ్యాండిల్.

# మొక్కజొన్నను వేయించేద్దామిలా..!

రుచి అభిరుచి




**కావలసినవి**

**బేబీకార్న్:** అరకిలో, **నిమ్మకాయలు:** మూడు, **అల్లంవెల్లుల్లి:** టీస్పూను, **పసుపు:** టీస్పూను, **కారం:** 2 టీస్పూన్లు, **గరంమసాలా:** ముప్పావు టీస్పూను, **బియ్యప్పిండి:** 100గ్రా., **మొక్కజొన్నపిండి:** 100గ్రా., **నూనె:** వేయించడానికి సరిపడా, **ఆవాలు:** టీస్పూను, **ఉల్లిముక్కలు:** కప్పు, **పచ్చిమిర్చి ముక్కలు:** టేబుల్‌స్పూను, **కరివేపాకు:** 4 రెబ్బలు, **పెరుగు:** పావుకప్పు, **అల్లంతురుము:** టీస్పూను, **కొత్తిమీర తురుము:** అరకప్పు, **ఉప్పు:** తగినంత

**తయారుచేసే విధానం**

★ ఓ గిన్నెలో నిమ్మరసం, అల్లంవెల్లుల్లి, పసుపు, కారం, గరంమసాలా, ఉప్పు, బియ్యప్పిండి, మొక్కజొన్నపిండి వేసి బాగా కలిపి ఆ మిశ్రమాన్ని బేబీకార్న్‌కి పట్టించాలి. తరవాత వీటిని కాగిన నూనెలో వేయించి తీయాలి.

★ విడిగా ఓ బాణలిలో కొద్దిగా నూనె వేసి ఆవాలు వేసి వేగాక ఉల్లిముక్కలు, పచ్చిమిర్చి ముక్కలు, అల్లం తురుము, కరివేపాకు వేసి వేయించాలి. ఇప్పుడు పెరుగు వేసి కలపాలి. తరవాత వేయించిన బేబీకార్న్ వేసి మరో రెండు నిమిషాలు ఉడికించి దించేముందు కొత్తిమీర తురుము చల్లి, పల్లీల చట్నీతో అందిస్తే ఎంతో రుచిగా ఉంటాయి.




**కావలసినవి**

**మొక్కజొన్న గింజలు:** 2 కప్పులు, **ఉల్లిపాయ:** ఒకటి, **వెల్లుల్లి:** రెండు, **పచ్చిమిర్చి:** రెండు, **బేకింగ్ సోడా:** అరటీస్పూను, **సెనగపిండి:** 2 టేబుల్‌స్పూన్లు, **మైదా:** టేబుల్‌స్పూను, **జీలకర్ర పొడి:** అరటీస్పూను, **నూనె:** వేయించడానికి సరిపడా, **కొత్తిమీర తురుము:** టేబుల్‌స్పూను, **పాలు:** 2 టేబుల్‌స్పూన్లు, **కారం:** టీస్పూను, **ఉప్పు:** తగినంత

**తయారుచేసే విధానం**

★ పాన్‌లో ఉల్లిముక్కలు, వెల్లుల్లి ముక్కలు, మొక్కజొన్న గింజలు, పచ్చిమిర్చి ముక్కలు వేసి రెండు నిమిషాలు వేయించి తీయాలి.

★ తరవాత వీటిని మిక్సీలో వేసి మెత్తగా రుబ్బాలి. దీనికి సెనగపిండి, మైదా, బేకింగ్ సోడా, జీలకర్రపొడి, ఉప్పు, కారం, కొత్తిమీర తురుము చేర్చి కలపాలి.

★ తరవాత పాలు పోసి గుండ్రని ఉండల్లా చేసి కాగిన నూనెలో వేయించి తీసి సాస్‌తో అందించాలి.




**కావలసినవి**

**మైదా:** 2 టేబుల్‌స్పూన్లు, **పాలు:** కప్పు, **ఉడికించిన అన్నం:** కప్పు, **స్వీట్‌కార్న్:** అరకప్పు, **వెన్న:** టేబుల్‌స్పూను, **ఉప్పు:** రుచికి సరిపడా, **మిరియాలపొడి:** టీస్పూను, **కొత్తిమీర తురుము:** అరకప్పు, **నూనె:** టేబుల్‌స్పూను, **బైట్స్‌కోసం: నూనె:** టేబుల్‌స్పూను, **మంచినీళ్లు:** అరకప్పు, **మైదా:** టేబుల్‌స్పూను, **బ్రెడ్‌పొడి:** 2 టేబుల్‌స్పూన్లు

**తయారుచేసే విధానం**

★ పాన్‌లో వెన్న వేసి కరిగిన తరవాత మైదా వేసి కలపాలి. తరవాత అరకప్పు పాలు పోసి కలుపుతూ చిక్కని సాస్‌లా అయ్యేవరకూ ఉడికించాలి. ఇప్పుడు దీన్ని ఓ గిన్నెలో వేయాలి. అందులోనే మెత్తగా రుబ్బిన స్వీట్‌కార్న్, ఉడికించి మెత్తగా మెదిపిన అన్నం, పచ్చిమిర్చి ముక్కలు, కొత్తిమీర తురుము, మిరియాలపొడి, ఉప్పు వేసి కలపాలి.

★ తరవాత మిశ్రమాన్ని నలుచదరపు బిళ్లల్లా చేయాలి. ఇప్పుడు ఓ గిన్నెలో మైదాపిండి, నీళ్లు పోసి కలపాలి. బిళ్లల్ని ఈ మిశ్రమంలో ముంచి బ్రెడ్ పొడి అద్ది, పెనం మీద కొద్దికొద్దిగా నూనె వేస్తూ రెండు వైపులా కాల్చి తీయాలి.




**కావలసినవి**

**ఉడికించిన మొక్కజొన్న గింజలు:** కప్పు, **బంగాళాదుంపలు:** నాలుగు, **చీజ్ తురుము:** 4 టేబుల్‌స్పూన్లు, **పచ్చిమిర్చి:** నాలుగు, **పన్నీర్:** పావుకిలో, **మైదా:** కప్పు, **చిల్లీ సాస్:** టేబుల్‌స్పూను, **పాలు:** 2 కప్పులు, **వెన్న:** 4 టేబుల్‌స్పూన్లు, **ఉప్పు:** రుచికి సరిపడా, **నూనె:** వేయించడానికి సరిపడా, **ఉండల్ని ముంచేందుకు: మైదా:** 4 టేబుల్‌స్పూన్లు, **మంచినీళ్లు:** ఒకటిన్నర కప్పులు, **బ్రెడ్‌పొడి:** 2 టేబుల్‌స్పూన్లు

**తయారుచేసే విధానం**

★ పాన్‌లో వెన్న వేసి కరిగించాలి. అందులోనే మైదాపిండి వేసి అరనిమిషం వేయించాలి. తరవాత పాలుపోసి కలుపుతూ ఉడికించాలి. సన్నగా తరిగిన పన్నీర్, ఉడికించి మెత్తగా మెదిపిన బంగాళాదుంపముద్ద, పచ్చిమిర్చి ముక్కలు, చీజ్ తురుము, కొత్తిమీర తురుము, మైదా మిశ్రమం, ఉప్పు వేసి కలిపి ఉండలు చేయాలి.

★ ఓ గిన్నెలో మైదాపిండి వేసి అందులో మంచినీళ్లు పోసి పేస్టులా చేయాలి. ఇప్పుడు ఉండల్ని ఇందులో ముంచి బ్రెడ్ పొడి అద్ది కాగిన నూనెలో వేయించి తీయాలి.

మరిన్ని వంటల కోసం
www.eenadu.net లోని
రుచులు పేజీ చూడండి.







ఊదారంగు మొక్కజొన్నలూ నీలాల వేరుసెనగగుళ్లూ దాల్చినచెక్క వాసనతో ఉండే తులసి మొక్కలూ రంగురంగుల బెండకాయలూ... ఇలా అంతరించిపోవడానికి సిద్ధంగా ఉన్న అరుదైన కూరగాయల జాతుల గురించి తెలుసుకోవాలన్నా చూడాలన్నా బెంగళూరులోని హరియాలీ సీడ్ బ్యాంక్ వ్యవస్థాపకుడైన డాక్టర్ ప్రభాకరరావుని సంప్రదించాల్సిందే.

# అరుదైన విత్తనాలు...అక్కడ మాత్రమే!

ఓ ముప్ఫై నలభై యేళ్లు వెనక్కి వెళ్తే- సన్న బియ్యం చాలా అరుదు. వాటికి బదులుగా అక్కుళ్లు, బుడమ, ఎర్రబియ్యం .. ఇలా రక రకాల ధాన్యాన్ని పండించేవాళ్లు. చూస్తుండ గానే అవన్నీ వాడుకలో కనుమరుగైపో యాయి. అలా జరక్కుండా ఉండాలంటే డాక్టర్ ప్రభాకర్‌రావు లాంటివాళ్లు ప్రాంతానికి ఒక్కరు ఉన్నా చాలు. అవునుమరి, ఆయన చేస్తున్నది అదే. ప్రపంచవ్యాప్తంగా అంతరించి పోవడానికి సిద్ధంగా ఉన్నవీ పూర్వకాలం నాటివీ అయిన కూరగాయల్ని సేకరించి పండిస్తూ తన విత్తన బ్యాంకులో భద్రపరుస్తు న్నారు. ఆసక్తి ఉన్నవాళ్లకి విక్రయిస్తూ, సహజ పద్ధతుల్లో వాటిని పండించే విధానం మీద వర్క్‌షాపుల్ని నిర్వహిస్తూ ఆయా జాతుల్ని బతికించే ప్రయత్నం చేస్తున్నారు.

## ఎలా మొదలైంది?

1980వ దశకం... మనదేశంలో హరిత విప్లవం ఊపందుకుంటోన్న సమయం... ప్రభాకర్‌రావు కూడా జన్యుశాస్త్రంలోనూ వృక్ష జాతుల సంకరీకరణలోనూ డాక్టరేట్ అందుకు న్నారు. కానీ 'హైబ్రిడ్ విత్తనాలూ రసాయనిక ఎరువులూ వాడి పండిస్తోన్న ఈ వ్యవసాయ విధానం శాశ్వతమేనా... దీని ఫలితాలు ఎలా ఉండబోతున్నాయి...' అన్న ప్రశ్నలు ఆయన్ని నిత్యం వెంటాడేవి. ఎందుకంటే దీనివల్ల కొంతకాలానికి నేలసారం దారుణంగా దెబ్బతిని, బంజరుగా మారిపోయే ప్రమాదం పొంచి ఉందన్న ఆలోచనే ఆయనకు బాధాక రంగా తోచేది. దాంతో వ్యవసాయాన్ని వదిలి లూసియానాకి వెళ్లి ఆర్కిటెక్చర్ చదివి, వృత్తి రీత్యా ప్రపంచవ్యాప్తంగా అనేక దేశాలు పర్యటించారు. అయినా వ్యవసాయరంగం పట్ల ప్రేమ చావలేదు. ఆయా దేశాల్లో ఉన్న పుడు స్థానికంగా పండే పూర్వ కాలంనాటి కూరగాయల విత్తనాలను సేకరించేవారు. ఇంటర్నేషనల్ సీడ్ సేవర్స్ ఎక్ఛేంజ్‌లో చేరి, అధ్యయనం చేయడం ప్రారంభించారు. పదవీవిరమణానంతరం- దాదాపు 35 సంవత్స రాలుగా భిన్నదేశాలనుంచి సేకరించిన విత్త నాలను తీసుకుని ఆరేళ్ల క్రితమే స్వదేశానికి తిరిగొచ్చి, విత్తనబ్యాంకుని ప్రారంభించారు.

## అన్నీ హైబ్రిడ్‌లే!

అలాగని ఆయన విత్తనాలను భారీ మొత్తంలో విక్రయించరు. ఎవరికైనా కొద్దిగా ఒక్కసారి మాత్రమే ఇస్తారు. అదేమంటే- 'తరవాతి ఏడాదికి విత్తనాలు వాళ్లే పండించు కోవాలి. రైతు విత్తనాలు కొనడానికి మార్కెట్‌కి వెళ్లకూడదు. కేవలం పంట విక్రయించేందుకే వెళ్లాలి అనేది నా సిద్ధాంతం. ఒకప్పుడు రైతులు తమ విత్తనాలకోసం కొంత పంటను పక్కగా వేసుకునేవారు. కానీ ఇప్పుడు అది పోయి, కొనడానికి అలవాటుపడిపోయారు. దాంతో మనం తినే కూరగాయల్లో 90 శాతం అన్నీ హైబ్రిడ్ రకాలే. ఫలితంగా స్థానికంగా పండే కూరగాయలన్నీ ఏటా కొన్ని చొప్పున అంతరించిపోతున్నాయి. ముఖ్యంగా పది హేనేళ్ల నుంచీ పూర్వీక జాతులకు చెందిన వందల రకాల కూరగాయల జాతులు వేగంగా అంతరించిపోతున్నాయి. ప్రపంచవ్యాప్తంగా ప్రభుత్వాలూ స్వచ్ఛంద సంస్థలూ అంతరించి పోతోన్న జంతువులపట్ల చూపుతోన్న శ్రద్ధ, మొక్కలపట్ల చూపడం లేదనే చెప్పాలి. అందుకే నా వంతుగా ఈ బ్యాంకుని స్థాపిం చాను. నా ఈ ప్రయత్నం సముద్రంలో నీటి బొట్టులాంటిదే కావచ్చు. కానీ కొన్ని జాతుల యినా బతికితే అంతే చాలు. ఉదాహరణకు తోటకూరనే తీసుకుందాం... పలుచని కాడలూ ఆకులూ ఎక్కువగా ఉండే తోటకూరే మనకిప్పుడు కనిపిస్తుంది. అదే ముప్ఫయ్యేళ్ల క్రితం లావుపాటి కాడ ఉండే తోటకూరే ఉండేది. ఒకసారి నేను పెరూకి వెళ్లినప్పుడు ఎరుపురంగు క్వినోవా గింజలకోసం వెతుకు తుంటే లావుపాటి కాడలున్న తోటకూర కనిపించింది. దాని గింజల్ని తీసుకొచ్చి ఇక్కడ బతికించా. అలాగే ప్రత్యేకమైన రుచీ వాసనా కలిగిన బంగ్లాదేశ్ వంకాయని ఎక్కువగా బిర్యానీల్లో వాడుతుంటారు. కానీ ఈమధ్య దాన్ని పండించడం మానేశారు. పశ్చిమ్ బంగాకి వెళ్లినప్పుడు ఓ పెద్దాయన కొన్ని గింజలున్న ఓ ఎండు వంకాయని ఇచ్చాడు. దాని విత్తనాలతో ఇప్పుడు వెయ్యి విత్తనాలు చేయగలిగాను. అరుదైన ఈ విత్తనాలన్నిం టినీ కేవలం పంటపొలాల్లోనే కాదు, నగరాల్లో పెంచే రూఫ్‌గార్డెన్లలోనూ బాల్కనీల్లోనూ గ్రీన్‌హౌసుల్లోనూ కూడా పండించుకోవచ్చు' అంటూ వివరిస్తారు ప్రభాకర్.

ప్రస్తుతం ఆయన దగ్గర ప్రపంచవ్యాప్తంగా సేకరించిన 560 జాతులకు చెందిన కూర గాయల విత్తనాలు ఉన్నాయి. వీటిలో ముప్ఫై రకాలు మనదేశానికి చెందినవే కావడం విశేషం. అయితే ఈ మొత్తం విత్తనాల్లో మన వాతావరణంలో పండే 140 రకాలను బెంగళూరు శివార్లలోని కనకపుర దగ్గరున్న తన రెండున్నర ఎకరాల క్షేత్రంలో వేదకాలంనాటి సంప్రదాయపద్ధతుల్లో పండిస్తున్నారు. వాటిల్లో 19రకాల విదేశీ టొమాటోజాతులూ రకరకాల సలాడ్ ఆకులూ స్ట్రాబెర్రీ మొక్కజొన్న, జర్మనీకి చెందిన చిక్కుడు రకం, తియ్యని మిర్చి, లావెండర్, నిమ్మ వాసనలతో పుష్పించే ఔషధమొక్కలూ... ఇలా ఎన్నో ఉన్నాయి. అందుకే, పర్యావరణం పట్లా అరుదైన జాతులపట్లా ఆయన మమ కారాన్ని మెచ్చుకోకుండా ఉండగలమా?! ★



# రాశి ఫలం


గ్రహబలం (సెప్టెంబరు 10 - 16)

డా॥ శంకరమంచి రామకృష్ణ శాస్త్రి






**మేషం** అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం

సమష్టి కృషితో విజయం సాధిస్తారు. ఉద్యోగంలో ఇబ్బందులుంటాయి. బుద్ధిబలాన్ని ఉపయోగించాలి. మంచి ఆలోచనలు వస్తాయి. లక్ష్యసాధనలో ముందడుగు వేస్తారు. అనుకున్న పనులు వెంటనే పూర్తవుతాయి. ఇబ్బందిపెట్టే పరిస్థితులున్నాయి. ఆత్మవిశ్వాసం కాపాడుతుంది. విషయాల్ని మరీ లోతుగా ఆలోచించవద్దు. ఆర్థిక సమస్యలొస్తాయి. శనిధ్యానం శుభప్రదం.



**వృషభం** కృత్తిక 2,3,4 పాదాలు; రోహిణి, మృగశిర 1,2 పాదాలు

సౌభాగ్యవంతులు అవుతారు. సుఖసంతోషాలుంటాయి. గౌరవ మర్యాదలు లభిస్తాయి. ఆర్థికస్థితి శుభప్రదం. ఖర్చు పెరిగే అవకాశముంది. ఇష్టమైన వారితో ఆనందంగా గడుపుతారు. ఆస్తి విషయంలో సరైన నిర్ణయాలు తీసుకోవాలి. గృహంలో శుభాలు జరుగుతాయి. నూతన అధికారాలు వస్తాయి. శుభ వార్తలు వింటారు. శివారాధన మేలు చేస్తుంది.



**మిథునం** మృగశిర 3, 4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పాదాలు

అదృష్టయోగం ఉంది. ఎంత శ్రమ చేస్తే అంత గొప్పవారు అవుతారు. గుర్తింపు లభిస్తుంది. చేస్తున్న పనిలో గౌరవం పెరుగుతుంది. మిత్రుల సహకారం పరిపూర్ణంగా ఉంటుంది. శత్రువులపై విజయం సాధిస్తారు. కుటుంబసభ్యుల సూచనలు సహకరిస్తాయి. ఆర్థిక అభివృద్ధి ఉంది. చంచల స్వభావం వల్ల తగాదాలకు అవకాశముంటుంది. గణపతి దర్శనం ఉత్తమం.



**కర్కాటకం** పునర్వసు 4వ పాదం; పుష్యమి, ఆశ్లేష

శుభ ఫలితాలున్నాయి. మంచి మనసుతో చేసే పనులు త్వరగా విజయాన్నిస్తాయి. ఐశ్వర్యప్రాప్తి ఉంది. సమర్థంగా పనిచేసి ప్రశంసలు పొందుతారు. అధికారుల ప్రోత్సాహం లభిస్తుంది. వ్యాపారం కలిసి వస్తుంది. విందూ వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. చెడు ఆలోచనలు రానీయకండి. ఒత్తిడికి గురికావద్దు. లక్ష్మీ అష్టోత్తరం చదవాలి.



**సింహం** మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం

ఆలోచించి పనులు చేయాలి. సమయానుకూలంగా వ్యవహరించండి. సమస్యలు పెరుగుతాయి. సమష్టి ఆలోచనలు మంచి చేస్తాయి. రుణ సమస్యలొచ్చే అవకాశం ఉంది. పనుల్లో అశ్రద్ధ వల్ల కాలం వృథా అవుతుంది. తోటివారి సలహాలు పనికి వస్తాయి. అడుగడుగునా అడ్డుతగిలే వారుంటారు. దైవశక్తి కాపాడుతోంది. సూర్యస్తుతి మేలు చేస్తుంది.



**కన్య** ఉత్తర 2, 3, 4 పాదాలు; హస్త, చిత్త 1, 2 పాదాలు

పనుల్లో శీఘ్ర విజయం సిద్ధిస్తుంది. మనసుకు నచ్చిన విధంగా పనిచేయండి. ధైర్యసాహసాలు ప్రదర్శించి ఒక పని పూర్తిచేస్తారు. అపార్థాలకు అవకాశం ఉంది. వివాదాలకు దూరంగా ఉండాలి. వృత్తి ఉద్యోగ వ్యాపారాల్లో శుభకాలం. దగ్గరివారి వల్ల మోసం జరిగే సూచనలున్నాయి. ఆధ్యాత్మిక బలం పెంచుకోవాలి. ఇష్టదేవతారాధన శుభప్రదం.



**తుల** చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు

విజయావకాశాలు పెరుగుతాయి. విశ్వాసంతో పని చేయండి. తగిన ప్రతిఫలం, గుర్తింపూ లభిస్తాయి. కష్టమైన పనుల్నీ సునాయాసంగా పూర్తి చేయగలుగుతారు. బుద్ధిబలాన్ని ఉపయోగించి విపత్కర పరిస్థితుల నుంచి బయటపడతారు. కీర్తించేవారు పెరుగుతారు. సహాయ సహకారాలు అందుతాయి. ఆరోగ్యం సహకరిస్తుంది. లక్ష్మీధ్యానం అదృష్టాన్నిస్తుంది.



**వృశ్చికం** విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ

అదృష్టఫలాలు అందుతాయి. ప్రారంభించిన పనుల్ని నిర్విఘ్నంగా పూర్తిచేయగలుగుతారు. ధనధాన్య లాభాలున్నాయి. ఒక పనిలో ముందడుగు వేస్తారు. గతంలో అనుకున్న కొన్ని పనులు ఇప్పుడు కార్యరూపాన్నిస్తాయి. ఆలోచించి నిర్ణయాలు తీసుకోండి. శుభకార్యాల కోసం ధనం ఖర్చు చేస్తారు. కొన్ని వార్తలు ఆత్మవిశ్వాసాన్ని పెంచుతాయి. ఇష్టదేవతారాధన మేలు చేస్తుంది.



**ధనుస్సు** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం

ఒక ప్రణాళిక ప్రకారం పనిచేయండి. విఘ్నాలు అధికమవుతాయి. మనోబలంతో ఆపదలను ఎదుర్కోవాలి. ఎవరినీ నమ్మవద్దు. ఆర్థిక ఇబ్బందులు తలెత్తకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. సొంత ఆలోచనలు సరిగా పనిచేయవు. కుటుంబ సభ్యుల సలహాలు తీసుకోండి. కష్టానికి తగ్గ ప్రతిఫలం దక్కుతుంది. వారాంతంలో బాగుంటుంది. వేంకటేశ్వర స్వామిని ప్రార్థించాలి.



**మకరం** ఉత్తరాషాఢ 2, 3, 4 పాదాలు; శ్రవణం, ధనిష్ఠ 1, 2 పాదాలు

విజయం చేరువలోనే ఉంది. అధికారుల మన్ననలు లభిస్తాయి. తగినంత ధనం చేతిలో ఉంటుంది. అవసరాలకు మిత్రుల సహకారం అందుతుంది. చేయదలచిన పని వెంటనే ప్రారంభించండి, మేలు కలుగుతుంది. మొహమాటాన్ని పక్కన పెట్టి పనిచేయండి. శీఘ్ర కార్యసిద్ధి. అనాలోచిత నిర్ణయాల వల్ల శాంతి తగ్గే ప్రమాదముంది. విష్ణుధ్యానం సదా శ్రేయస్సునిస్తుంది.



**కుంభం** ధనిష్ఠ 3, 4 పాదాలు; శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు

సున్నితమైన అంశాల్లో జాగ్రత్తగా వ్యవహరించాలి. పదేపదే ఒకే విషయాన్ని ఆలోచిస్తూ ఉండవద్దు. ఉద్యోగంలో వ్యతిరేక వాతావరణం ఏర్పడే సూచనలున్నాయి. వారం మధ్యలో ఒక మంచి జరుగుతుంది. ఇబ్బందిపెట్టే వారున్నారు. అతిగా స్పందించవద్దు. స్పష్టమైన నిర్ణయాలు తీసుకోవడం ద్వారా కార్యసిద్ధి ఉంటుంది. ఆంజనేయస్వామి వారిని దర్శించండి.



**మీనం** పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి

ఏది కోరుకుంటే అది సిద్ధించే కాలమిది. సమయాన్ని మంచి భవిష్యత్తు కోసం వినియోగించండి. ఇబ్బందిపెట్టే పరిస్థితులున్నా వారం మధ్యలో విజయం చేకూరుతుంది. ఆత్మీయుల సూచనలు పనిచేస్తాయి. దగ్గరి వారితో వివాదం రానీయకండి. కాలం ప్రశాంతంగా గడుస్తుంది. దైవాన్ని తలచుకొని పనులు ప్రారంభించాలి. శుభవార్తలు వింటారు. ఇష్టదైవ ధ్యానం శుభప్రదం.

